సరస్వతీ గ్రంథమండలి :

# భావతరంగములు

## ప్రథమభాగము

అష్టావధాని

**చిలుకూరి రామభద్రశాస్త్రి**



పబ్లిషర్సు : అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# BHĀVATHARANGAMULU

[ Vol. 1. ]

By

CHILUKURI RAMABHADRA SASTRY

First Edition - October 1961 - Price Rs. 1 - 50





Publishers: ADDEPALLY & CO.

SARASWATHI POWER PRESS

RAJAHMUNDRY (A. P.)

# మ న వి

శ్రీమహితులార ! విజ్ఞతాజేయులార!
ఆంధ్ర సోదరులార ! మహాత్ములార !
నేను చేసెడి మనవిని నిర్మలాత్మ
లందు జేర్పుఁడు — తీరికయ్యవుసరాన
నేను వ్రాసిన వ్రాతలే కానగాను
మహిని "భావతరంగ" నామంబునందె
సంస్కృతాంధ్రపు గ్రంధాలసారు — తేట
తెనుఁగు నందున బలుకగా "దెలియనట్టి
వారికిని దెలియంగ నపార లాభ"
మనియె వ్రాసితి — దొసఁగులు నలరుఁ గాక !
కోవిదులు నాకుఁ దెలిపిన గూర్మితోడ
దిద్దుకొందును — సలహాలఁ దెలుపుఁడయ్య !

సీ॥ కడఁక సరస్వతీ గ్రంథమాల వినేత !
దుర్లక్షణా ల్లేని దొడ్డనీతి !
అల సరస్వతి ప్రెస్సునందు వేన్వేలుగా
గ్రంథాల ముద్రించు ఘనవిజేత !
కవిపండితులనెల్ల ఘనమిత్రములనుగా
సేవించి గొలిచెడి చేతిపాతు !
అద్దెపల్లి యనెడి యాఖ్యతో వెలసిన
కులమున బుట్టిన గుణతతంబు!
బి. ఎ. ప్యాసయి మంచి ప్రియవక్తృత ల్గల
అల వివేకానంద యాఖ్యకు బతి!

గీ॥ పేరు నాగేశ్వరుండు — అప్పేరె గాదు
సారు—నీటును—గోటును—సరసతఁగన
మంచివాడని ముఖమెల్ల మంచిచెప్పు
దీని ముద్రణనాధుఁ డీఁ, ధీరుఁడయ్యె !
అతఁడు దీర్ఘాయురారోగ్యమందుఁగాత!
అలరు కావ్యాల సంతతి యాత్మజతతి.

ఆ. వె. సిరులు విద్యగల్గు చిలుకూరి కులమున
రామచంద్రుబోలెగ్రాలి - సుగుణ
తండ్ర మంత-నిష్ఠ-దానికిఁ దోడుగా
బాల్యమంతఁ జదివెఁ బగ్గె వెలుఁగ
సాగుచుండెఁగాదె! సరిపల్లె సఖ్యాభి
వర్ధకాఖ్యనిలయ — పాఠశాల
అందువర్ధనాఖ్యుఁ డత్యుత్తమంబైన
శాబ్దమందు నొజ్జ! — సంతుకొజ్జ!
మనకధావినేత జనకుని చెంతనే
కావ్యనాటకాది ఘనకృతులను
శబ్దశాస్త్రభాగజాలంబుఁ జదివెను
అక్కి-పెద్ది రాజనావధాని
చెంత వేదవిద్యఁ జేరి పఠించెను
జైమినీయమంత జదివె నొకట
దా నలంకృతిని ముదాననేర్చియె సదా
పఠనపాఠనాది భాగ్యయుతుల
ఛాత్రుతతిని జాలసంతుగా నెంచెను
తండ్రివర్ధనార్యు దైవ మేఁగ
తల్లి—నాయనమ్మ—తమ్ముఁడనౌ నేను
చెల్లె—లిందఱుండ—శ్రీశు కరుణ
రాజమండ్రిలోన గ్రాలు ఆర్యాపురీ
పాఠశాలలోన పండితుఁడయి
నూటపదియునేడు సాటివిద్యార్థుల
పండితాఖ్యలంది వరలఁజేసి
నన్నుశాబ్దిఁజేసె మిన్నగాఁ బెండ్లిపే
రంటములను జేసె రాముదలఁచి
నాకమేగె. లక్ష్మినారాయణాఖ్యుని
గురున కంకితమిడి గొల్తుసతము.

రాజమండ్రి
1-10-1961

అష్టావధాని
రామభద్ర శాస్త్రి

# వి ష య సూ చి క

# భావతరంగములు

## 1. భగవంతుఁడు

(ధర్మపురములో సత్యవాదిసంఘము గలదు. అందు సభ్యులు సారంగశాస్త్రి- తిమ్మన్నకవి- పాపాచార్యులు- పాషాణశెట్టి- అమ్మాయమ్మ - యనువారు - అంత సభలో శాస్త్రి లేచి యిట్లుపన్యసింప మొదలిడెను.

మహాజనులారా! జీవకోటి ముక్తకళేబరములారా! సుకృత దుష్కృత కార్యకరణదక్ష బాహ్యాంతరేంద్రియులారా! మా సత్యవాది సంఘమును గొందఱి యంగీకారముచేత మఱికొందఱి బలాత్కారముచేత నింక గొందఱి వహిష్కారములచేతఁ గొందఱి తిరస్కారములచేత నారంభించినాము.

దీనిపై దేశములోఁ గొందరు వాదోపవాదములుచేసి కొందరు రాద్ధాంతసిద్ధాంతములుచేసి కొందరి చర్చలమూల మున గొంద అభోజనములతో నుపవసించుట జరిగినది. నాకుఁ గొన్నిజాబులు ప్రతిదినము వచ్చుచున్నవి, నేఁడొకజాబు వచ్చినది. అదిదియే!

(శ్రీ శాస్త్రిగారికి నమోవాకము- సత్యవాది సంఘస్థాపనచే మిమ్మనేకవిధములఁ బ్రశంసించుచున్నాను

ఆస్తిక జన కుఠారములు- నాస్తికజన వసంతములు నగు నీ దినములలోఁ దమ యుపన్యాసములకు విలువ యెంతగా నుండునో! గ్రామ్యములైన గాకుండగా గ్రాంథికములైన మీ వ్రాతలపస- పాకముల నెవరు గుర్తింతురో! ఆలోచింపుఁడు-

అయినను భగవంతుఁ డున్నాఁడా ? ఎక్కడ నున్నాఁడు ? ఏమి చేయుచున్నాఁడు ? అతనివ్యాప్తియేమి? వేదశాస్త్రములు- ఇతరమతములు నాతనిఁగూర్చి యేమనుచున్నవి? మనమాతని జేరుట యెట్లు? మున్నగు విమర్శనములతో మాకానందము గూర్పఁ బ్రార్థన.

ఇట్టులోకసత్యవాది
క్రోష్ట్రు రంధ్రపురము.

నాయనలారా! వినుఁడు- ప్రజనే ఈనాస్తికాక్రాంత దివసములలో నీస్వార్థపూరిత మానసాక్రాంతదినములలో నీదుఃఖజనకాత్మక దివసములలో నిట్టిసంఘమును స్థాపించుట వ్యర్థమే! ఇట్టిసంఘమును స్థాపించుటలో బాకము- పస- ఔచితియు ముక్కాలు మువ్వీసము లేదని నమ్మఁదగినదే;- కాని కవి యనగా వట్టి పట్టుదలగల యొకరకమైన పిచ్చివాఁడు. అతని కలమునకు ఆతని మనస్సునకు ఆతని జీవితమునకు శ్రాంతియే కాని విశ్రాంతిలేదు - ఉండబోదుకూడ. కావుననే పనిలేని మంగలి పిల్లితలగొరిగినట్లుగా నేటిసంగతుల సోదరమానవులకు విమర్శించి చెప్పదమనియే యీసంఘమును స్థాపించితిమి. దీనిని గుర్తించినవారొక్కరున్నను జాలును.

ఏ కవియుఁ గాలానుసారముగాఁ గాక బుద్ధ్యనుసారముగాఁ గవిత వ్రాయును. విమర్శించును. వ్రాయుఁడని నిర్బంధించినచో మొదటికే మోసమువచ్చును- బాబూ! వాల్మీకి మునిగారూ! రామాయణము వ్రాయుఁడు- దుశ్శాలువలు సింహాతలాటములు నిచ్చెదమని, అయ్యా! వ్యాసమునీంద్రులవారూ! భార

తను వ్రాయుఁడు- అగ్రహారము లిచ్చెదమనియు నెవరు గోరి నారు? ఎవరును గోరలేదు.

ఆ వ్యాస వాల్మీకుల హృదయావేదనలే లక్షలపైఁబడి శ్లోకములుగా మారినవి- కావున నాయనలారా! దేనినిగూర్చి కవి మనస్సు ద్రవించునో దానిఁగూర్చి కవి యప్పుడే కావ్యగానము నారంభించును.

ఇంక ఆస్తికజనసమ్మోదమునకై యద్వైతవ్యాప్తికై జంగమస్థావరాత్మకుఁడైన భగవంతుని సేవించుటకై యీసంఘమును స్థాపించితిమని మనవిచేసికొనుచు భగవంతునిగూర్చి ముందుగాఁ జర్చించెదను-

భగవంతుఁడు మనకన్న గొప్పవాఁడు? ఎందుచేత? మనము పదిమూఁగలవఱకుఁ బొడవుతోను- అయిదాఱువందల పౌనుల బరువుతోనునుండఁగా రోగాలతో సతమతమై కీచుమనుచుండఁగా నా దేవుఁడింతకన్నఁ దక్కువపొడవుతోఁ దక్కువరోగములతోఁ దక్కుచు దాఁగుచున్నాఁడా? లేక యింతకన్న నెక్కువవాఁడా? పదునాలుగువందల పౌనుల బరువునైన మనము పండ్లతో నెత్తఁగా నాతఁడు నాలుకతోనే యంతబరువు నెత్తఁగలఁడా? ఎత్తిన నెత్తుఁగాక! మాతత్త్వముచే నేము మెచ్చఁజాలము. కారణ మేమందురా? అసలు మాతత్త్వము చూచినచో మా యింటిలోనివానినిగాని మాయింటిప్రక్కవానినిగాని మాయూరి లోనివానినిగాని మా దేశస్థునిగాని మారాష్ట్రములోనుండువానిని గాని పదిమంది గొప్పవాఁడనుచు మొత్తుకొనుచున్నను 'వాని మొగము' వాఁడా? గొప్పవాఁడని త్రుంచిపారవేసి నాలుక చప్పరించి మెచ్చినవాని నధిక్షేపించి జాలినిసూచించుచు నెంత

గొప్పవాఁడనోయి! మనవారందఱు వట్టి దద్దమ్మలని నీకెంకను తెలియదా? అని వాని నీసడించెదరు.

ఈ యంతమన్ను లన్నిటికి దాటి ఎక్కువ గనపడకున్న వాండ్ర నయ్యొ మెల్లు?

అయిన నెందు గొప్పవాఁడందురా? ఎప్పుడు గొప్పవాఁడందురా? ఎక్కడ గొప్పవాఁడందురా? నాయనలారా! వినుఁడు— ఆభగవానుఁ డన్నిరాల గొప్పవాఁడే! త్రికాలములయందుఁ త్రిలోకములందు గొప్పవాఁడే! మనలో లేని యాఱు గుణము లాయనలో నెక్కువగా నున్నవి.

శ్లో॥ ఉత్పత్తించ వినాశంచ
భూతానామాగతిం గతిమ్
వేత్తి విద్యా మవిద్యాంచ
సవాచ్యో భగవానితి.

అనగా ప్రాణుల యుత్పత్తి మొదటిగుణము. మన భూలోకములో పిపీలికాది బ్రహ్మపర్యంతప్రాణులు సుకృత దుష్కృతములు సలుపుచుందురుగదా! వారివారి కర్మలనుజూచి మరణానంతరమున బరలోకములో సాక్ష్యములిచ్చుటకు ఈక్రిందివారు సిద్ధముగా నుందురు.

శ్లో॥ ఆదిత్య చంద్రావనిలోఽనలశ్చ
ద్యౌ ర్భూమి రాపో హృదయం యమశ్చ
అహశ్చ రాత్రిశ్చ ఉభేచ సంధ్యే
ధర్మశ్చ జానాతి నరస్య వృత్తమ్.

తే॥ గీ॥ రవిశశాంకులు వాయు హిరణ్యరేతు
దివి భువంబులు నీరు హృదియు యముండు

తేయి బవలును సంజలు రెండె గాక
ధర్మమున్గూడ నరవృత్తి దర్శనములు.

పై వారి వ్యాఖ్యానుసారముగా నచ్చట భోగభూములలోఁ బాపపుణ్యక్షయమువఱకు. పుణ్యము క్షీణించుటతోనే మర్త్య లోకమున (క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి॥) నుండి పిదప స్వస్వ కర్మానుసారముగా నీజీవుల సూకర శునక పశు మనుజాది యోనులయం దుద్భవింపఁజేయుశక్తి యా దేవునకేగాని మన మాజీమంత్రులకుగాని మనదేశాధ్యక్షునకుగాని మనలోకములో నెవ్వరికిని లేదు. అట్టి యుత్పత్తి శక్తిసంపన్నత భగవద్గుణములలో నొకటి! ఎట్లనగా వైద్యశాలకువచ్చిన స్త్రీలింతరాలికిఁ జికిత్సచేసి, గర్భవతిని బ్రసవించునట్లుగాఁజేయుశక్తి మన రాజ వైద్యులకు గలదుగాని గర్భములోనిశిశువుల మనయిష్టానుసారముగాఁ బురుషునిగాగాని స్త్రీనిగాఁగాని మార్చుశక్తియు గర్భవతులుకాని స్త్రీల కడుపుకోసియైనను శిశువును బైటకులాగు శక్తియుమనవైద్యులకు లేదే! సర్వవిధశక్తిసంపన్నుఁడైన ఆభగవంతుఁ డెట్టిశక్తియు లేని మనకన్న గొప్పవాఁడేగదా! కామయ్యను కత్తియుద్ధములోను, జట్లాటలోను, సిగరెట్లు కాల్చుటలోను, పాడుమద్యము పీల్చుటలోను మనము గొప్పవారము గాన నోడించవచ్చునుగాని పాకశాస్త్రవిధములో గరిటె త్రిప్పుటలోను మనమందఱ మాయనకు బలాదూరు— దిట్టిగా మమ్మలను మనక తప్పదుగదా!

అట్లే యుత్పన్నశక్తి మనకన్న నాభగవంతునకే హెచ్చు.

మనముమాత్రము సంవత్సరమొక జీవునో రెండుమూడు జీవులనో భూమికి లాగుకొనివచ్చి పోషించుట లేదా? అవ్వి

మన ప్రేమఫలములుగావా? ఆప్రేమ మనశక్తికి నిదర్శనము గాదా? అని ప్రశ్న రావచ్చును.

నాయనలారా! ఆయన తన మనస్సు, బుద్ధి, చిత్తము, శిరస్సు, బాహువులు, తొడలు, పాదములు మున్నగువాని నుండి ప్రాణికోటుల సృజించెను. ? చెప్పెదము- మనలోని వంధ్య-కాకవంధ్య- పుష్పవంధ్యలైన పూర్వబోధులకొకపిల్లవానిని ఒక్క యీశుపిల్లను గలిగించినచో వారి ప్రతిమను పూజించి మా కవిచేత వారిచరిత్ర నొక ప్రబంధముగా వ్రాయించి వారి పేర నొక కాఫీహోటలు, ఒక మంగలిషాపు, ఒకచాకలిషాపు పెట్టించి వారికీర్తి స్థిరమగునట్లు చేసెదము-ఇంక మన యీశు నాకు గర్భవతులై పిల్లలుగనుట లేదా? అని ప్రశ్నించెదరు కాబోలు-

నాయనా! మనవంశములోని బూర్వులుచేసిన మహాసుకృతముచేతను మన తల్లిదండ్రు లాచరించిన పూజాఫలముచేతను- మనయీశువారి పాతివ్రత్యప్రభావముచేతను మనయీశువారి సంతానభాగ్యవంత జాతకప్రభావములచేతమనకు సంతతిగలుగుచున్నదిగాని యందులో మనశక్తి మన యింద్రియనిగ్రహము లేమున్నవి?

నిజముగా నీకు శక్తియున్నచో నీవు చాలకాలమునుండి సనసురాలుగా- పాణిగృహీతగా శేవదీసిన పడమటివీధిలోని పాపాయిచే నొక్క పాపాయిని గనిపింపుము- ఈపాపాయి పిల్లల బెంచుకొనవలసినదేగాని తన్నక్రిందుగానుండి తపస్సు చేసినను సంతానము గలుగదుగదా?

కాన భగవంతున కర్తృత్వవిషయములో స్వతంత్ర ప్రజ్ఞ గలదని మన మంగీకరించవలెను.

ఈప్రజ్ఞచే కాలానుసారముగాఁ గర్మానుసారముగా నాతఁడు లోకోద్ధరణ మొనర్చుచుండును.

ఇంక 'భూతానా మాగతిం గతిమ్'

ఈసృష్టించబడిన ప్రాణిజాలము మహానుభావులు మొదలు మట్టిబెడ్డలవఱకుఁ గారణజన్ములుగలరు. ఎట్లనగాఁ గష్టపడు యోగము ప్రాయఁబడిన నుదురులుగల మహాత్ములు పతివ్రతలు గల కాలములోఁ బుట్టినవాఁడు రావణుఁడు. వారి కష్టములు గట్టెక్కు సమయములో నారావణ వధకై జన్మించినవాఁడు రాముఁడు. కాన రామునివలెనే రావణుఁడుకూడఁ గారణ జన్ముఁడనుట తప్పుదుగదా!

అయిన రావణుఁడు పుట్టుటతోడనే రాముడుకూడ నుద్భవించి రావణుని గడదేర్చరాదా? అని ప్రశ్నించుచున్నావా? విను. భగవంతుఁడుకూడ మనవలెనే ప్రతిపనిని సక్రమముగాఁ జేయనిచో నింద్యుఁడగునుగదా! లోకక్షేమమునకై రాముఁడు కూడ నొక యవసర సమయమున నుదయించవలెను. మఱి క నియమితకాలములో నవతారము జాలించవలెను గాని చిరంజీవిగా నయోధ్యనేగాక యావద్భారతదేశమును బాలించుచుండుచు నుండును అనరాదు- ఇదందఱకుఁ జిక్కే!

నాయనా! ఈనాడు కాళిదాసే జీవించియున్నచో నేటి సంస్కృతభాషకున్న నిరాదరణముజూచి బలవంతముగాఁ బ్రాణము విడిచెడివాఁడే!

నేను నన్నయభట్టుగారే జీవించియున్నచో నీభావకవితా దులఁజూచి బండపాఱిపోయి గోదావరిలో దిగియుండెడివాఁడే! కాన బ్రతివారు సకాలమున బుట్టినట్లే సకాలమున మరణించ నిచో జనాభా వృద్ధియు దేశము నరిపడక కుటుంబనియంత్రణ-సంతాననిరోధము- మున్నగు కార్యక్రమము లింతకన్న హెచ్చుగానుండెడివి! ఒకవేళ వారుండినను మనము సినీమాపాటలనే వినుచుముగాని త్యాగయ్యగారి కవిత్వనిర్వాహ్యయాయన గాన మాధురి కానందించలేకపోదుముగదా! కాన "యజ్జన్యం తన్నశ్య"మను న్యాయముచేఁ బుట్టినవారు గిట్టకతప్పదుగదా! కాన నీసంహారశక్తికూడ భగవచ్ఛక్తులలో రెండవది.

అయ్యో! పుట్టించుట కష్టమేమోగాని చంపుట మాటలేతేఁగాదా? అని యందురుగాబోలు! వినుఁడు.

ద్రౌపదీమానభంగ సమయములోనే పాండవులు కౌరవుల నేలఁ జంపలేకపోయిరి? కౌరవుల కాయువున్నది. కాలము సమీపింపనిదే యెవరి నెవరుకూడఁ జంపలేరు. దెబ్బతిన్నపాము కూడ మృత్యుయోగమున్న మనచేతికిదొరికి చచ్చునుగాని లేనిచోఁ దప్పించుకొని పారిపోవునుగదా! "ఆయుర్యన్నం ప్రయచ్ఛతి" అను వేదోక్తిననుసరించి యాయువే యన్నమునిచ్చును. ఆయువుండఁగా నామృత్యువు దరిఁజేరఁజాలక గ్రుడ్లుమిటకరించి చూచుచుండునుగదా! కాన నాశనకార్యముకూడ నా భగ వానుని విలాసములలో నొకటియే! ఇంక ప్రాణుల నీలోకము నుండి యాలోకమునకు బ్రయాణముచేయించువాఁడాతఁడేగాని మన విషరోగులు మన యుగ్రతాపములు మన మూతులు మన సదులు మున్నగునవిమాత్రము కావు.

భూతానా మాగతింగతిమ్—

అనగా నెవరెప్పు డీభూమికి కర్మచేయుటకై రావలెనో! ఎవ రెప్పుడు కర్మానుభవమునకై పోవలెనో! వీనిని దెలియుటయు ఆదేవుని గుణములే !

నాయనలారా! చూడుఁడు! అంగడివీధిలో జాలమంది యిటునటు తిరుగుచున్నారు— అందుకుఁగారణములేమి ? కొన్ని కొలఁది గలవు.

కొందరు బ్రాకెట్టుల నాడుటకు మరికొందరు వారాంగనా దర్శనమునకు మరికొందరుసినీమాటిక్కెట్లకు నికఁగొందరు తమయింపుడుకత్తెలకై గ్లాస్కోచీరెలుగొనుటకుఁ బోవు చున్నారు. ఒకధనికుఁడు తన కుక్కకు బంగారుగొలుసు కొను టకుఁ బోవుచున్నాఁడు. అదిగోచూడుఁడు, ఆభిక్షుకుఁడాత్ర ముతోఁ బోవుచు కారుక్రిందఁబడినాఁడు— నాయనలారా! ఒక పండితుఁడాపోవువాఁడు— రేయినుండియు పొడుములేక ముక్కురంధ్రములు నొలుచునంతటి బాధచే నస్యాంగణమునకు మనస్థిమితము లేకపోవుచున్నాఁడు— చూచితివా? నాయనా! ఆయన యొక భగవద్భక్తుఁడు— విష్ణుభక్తితత్పరయుఁడై విష్ణ్వా లయమునకు బదులు వేశ్యాలయమునకేఁగి దేవతను జూపుమని పూజారియను భ్రాంతితో ఆవేశ్యమాత కాళ్ళపైఁ బడు చున్నాఁడు.

చూడుఁడు—పాపమావేశ్యయింటి కొకచోరుఁడు సరసమున కనిపోయి యామె నిద్రించుచుండగా నగలతోఁ బాటు గా ఆమెజుట్టు— ముక్కునుగూడఁ గోసితెచ్చి యామెను వ్యర్థ జీవినిగాఁ చేయుచున్నాఁడు— కాన నీరిలో నెవరేపనికై

యెటకుఁ బోయెదరో! నిర్ణయింపఁజాలనుగదా! అట్టిచో ఈ యనంతకోటి జీవులలో ఎవరెవ్వ రేలోకమునకుఁ బోవలెనో! ఎవరెవ్వ రెందుకెక్కుడను రావలెనో! అనుగుణవ్యయ మా భగవంతునకేగాని యితరులకు లేదు

ఇంక వేత్తి విద్యా మవిద్యాంచ

అనగా జ్ఞానాజ్ఞానములఁ దెలియుట- జగత్తులో అజ్ఞానవంతులు- జ్ఞానవంతులు- అని రెండురకములు. ఒకరినొకరు పరస్పరము నీచముగా భావించెదరు.

మనకువలెనే యీతఁడుకూడ స్నానసంధ్యాదుల నాచరించగూడదా? అనియు, అందఱు సన్యాసులు నైష్ఠికులై ముక్కుపట్టుకొని కూర్చొన్నచో లౌకికకార్యముల జక్కబెట్టునదెవరనియు అవమానించుకొందురు. పాఠశాలలో తన క్రిందివారందఱు చొంగలనియుఁ దనకన్న తక్కువవారు గావుననే తాను ప్రధానోపాధ్యాయుఁడనైతినని యాప్రధానోపాధ్యాయుఁడు భావించి తనదర్జాను తనతీవిని తానే మెచ్చుకొనును- ఈతఁడు చవటకావునమనవలననేయీపాఠశాల పనుగిడుచున్నదని క్రిందివారు భావించెదరు. కాన ఈజ్ఞానాజ్ఞాన విదగ్ధత యా భగవంతునకొకనికే గలదు. కావుననే మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ, రామ, కృష్ణాద్యవతారముల దాల్చెను. కృష్ణ, బుద్ధావతారములలో జ్ఞానిగా నటించి మిగిలిన యవతారములలో అజ్ఞానిగా నటించెను. అట్లు రెండు రకముల నటన యా జ్ఞాన- అజ్ఞాన స్వరూపములను బాగుగా నెఱుఁగనివాని కెట్లు సాధ్యమగును? అందుకే గీతలో-

శ్లో॥ తాన్యహం వేద సర్వాణి

ఆ వెనుకటి జన్మముల సంగతుల నన్నింటిని నే నెఱుగుదును. నీ వెఱుఁగ వన్నాఁడు. వేదములో

యతోవా ఇమాని భూతాని జాయన్తే
యేనజాతాని జీవన్తి. యత్ప్రయన్త్యభి
సంవిశన్తి- అని చెప్పఁబడినది.

అనగా నీసృష్టి స్థితిలయాలకు భగవంతుఁడే కారణము. వారి కర్మానురూపముగా నా యా లోకముల కంపి వారి కవ్వసరమైన లింగ-కారణ- శరీరాదులనిచ్చి ప్రారబ్ధ మనుభవింపఁజేయుట- కర్మ చేయించుటలు భగవల్లక్షణములు. అనగా సృష్టి-నాశన ము- రాక-పోకలు- జ్ఞాన-అజ్ఞానములను నాఱు గుణములకు భగమని పేరు. అవ్వి గలవాఁడుగాన భగవంతుఁడైనాఁడు.

ఇంక నీయనవృత్తి యేమి? అని ప్రశ్న! అనంతకోటి జీవ రాశుల కనంతకోటి వృత్తులఁ గల్పించి పోషించు ఆ భగవంతునకు ఈసృష్టి స్థితిలయములే వృత్తులు! ఇంతకన్న గొప్పవృత్తి యేమిగలదు? తగవులు వినుట. సాక్ష్యములు వినుట. న్యాయవాదుల హేతుబద్ధవాదములు వినుచు వ్రాసికొనుట. ఈ తగవుల గూర్చి గ్రంథపరిశీలనాపూర్వకముగా సమాలోచించి తత్తత్కర్మానురూపముగా దోషికి శిక్ష విధించుటయు నింత కన్న న్యాయాధిపతుల కేమి కావలెను? బ్రాహ్మణార్థములఁ జేయవలెనా? గాలిబరకు గాథములఁ జెప్పవలెనా? కిరాణా కొట్టు పెట్టి యమ్ముకొనవలెనా?

కళాశాలాధ్యక్షులు కడవంత కడుపు నూపుకొని కాలి నడకతో కళాశాలకు ఆలస్యముగా వచ్చినను అఖండ పాండితీభరిత

వాగ్మండలడిండిమంబులతో హస్తచాలనరూపశస్త్రాస్త్రములతో లాలాజల సంయుక్తమహాప్రళయకాల మారుతములతో శిక్షాదక్షరూక్షేక్షణ విక్షేపములతో ఉపాధ్యాయ శార్దూల ముల విద్యార్థిమేషముల వేధించుటకంటే ఆయన కితరవృత్తు లేమికావలెను? ఆ యధ్యక్ష శార్దూలమునకు దీరిక యెక్కడిది? అట్లే లోకవ్యవహారనిమగ్నచిత్తుఁడైన యాభగవానునకుఁ దీరికయా? మహత్తర విషయవాంఛాహీనతాశౌండ సర్వవ్యాప కునకు దీరికయా? పైగా నిదంతయుఁ దన కాలక్షేపమునకై తన కులాసాకై చేయుచున్నాఁడట. నయాపైసకూడ ఆతనికి జీతము లేదట!

శ్లో॥ దేవస్యైష స్వభావోఽయ
మాప్తకామస్య కా స్పృహా-

ఈజగన్నాటకసూత్రధారత భగవంతుని విలాసమునకే కేవలమట! సర్వకామపరిపూర్ణుఁడైన యాతని కేకోరికలుండును? ఉండవు. పసిపాప మొదలు పరబ్రహ్మవఱకు దీరిక యెక్కడిది? కార్య వ్యగ్రత ఘనముసుమీ! దేవునకు విశ్రాంతియా? అతనికింత కన్న ఈలోకరక్షణకన్న ఈమలమూత్ర భూయిష్ఠ శరీరుల సృజించుటకన్న ఈ దుర్వాసనాభరితమాయా కళేబరముల పోషించుటకన్న ఈసుఖదుఃఖసమ్మిశ్రిత కళేబరముల నశింపఁ జేయుటకన్న ఇంకేవృత్తి కావలెను నాయనా!

ఆ దేవుఁ డెక్కడున్నాఁడని యొక లకోటా ప్రశ్నయా? ఇది చొప్పదంటుప్రశ్న కాదా? ఇంతవెలలేని పైసాకూడరాని ప్రశ్న యింకొకటి విన్నారా?

అతఁడు లేని తావు చూపఁగలరా? అతఁడు సర్వత్ర సర్వదా సర్వథాగలఁడే! నీటినుండిపుట్టి వేదముల గావలేదా? స్తంభము నుండిపుట్టి భక్తుని గావలేదా? చక్రాయుధమై దుర్వాసుని బారినుండి యంబరీషుని గావలేదా? బావయైపుట్టి పార్థుని గావ లేదా? నిత్యము వాహనప్రమాదములు రోగములు- గృహ కల్లోలములనుండి మనల గాచుట లేదా?

అతఁడు లేని చోటు గలదా? లేదే! భక్తులలోఁ బతివ్రత లలో సత్పురుషులలో భూమిలో ఆకాశములో జలములో నదులలో దేవతలలో దైతేయులలోఁ గలఁడట!

మాసములలో మార్గశీర్షమట! ఋతువులలో వసంత మట! భక్తులలోఁ బ్రహ్లాదుఁడట! కాలములలో వర్తమాన మట! పురుషులలో నైష్ఠికుఁడట!- ఒకఁడే యిన్ని రూపముల నెట్లు దాల్చును? అని శంకయా?

కార్యాలయమున అధికారియే సేవకులకు అయ్యగారుగా- భార్యకు మావారుగా- తలిదండ్రులకు సుబ్బిగాఁడుగా- ఆ గ్రామస్థులకు సుబ్బారావుగా- వారకాములకు రసికులుగా- శత్రువులకుఁ జవటగా ఒక వ్యక్తియే మారుచుండి వ్యవహ రింపబడుట లేదా? ఇట్లే పరమేశుఁడుకూడ పలురూపులతో అన్నిచోటులలో వర్తించి నర్తించుచున్నాఁడు. వేదములలో నొక భాగమైన మంత్రపుష్పము భగవంతునిగూర్చి ఇట్లు చెప్పుచున్నది.

శ్రుతి- యచ్చకించిజ్జగత్సర్వం.........

.........పరమస్స్వరాట్-

బ్రహ్మాండమే యవకాశమట! ఇదే చిన్న ఘటావకాశము వంటిదట! ఈజగత్తునకు బైట లోపల సర్వత్ర తానయై నారాయణుఁ డున్నాఁడట! అంతేకాను— మన శరీరములోఁగూడ ఆయన యున్నాఁడట! ఎక్కడున్నాఁడు? ఎట్లున్నాఁడందురా? మన గళమునకుఁ గ్రిందిభాగమున నాభికిఁబైన పంద్రెండంగుళముల పొడవుగల మన కడుపులోనే యున్నాఁడట! ఈ భాగములో అధోముఖమైన హృదయకమలమున్నది. (మన కడుపులోని కాలేయము (లివరు) మూపద్మాకారములో నుండుననియు ఈకాలేయము నాభికిపైన గంఠమునకుఁగ్రిందను గలదనియు, ఇదియే పదార్థముల జీర్ణింపఁజేసి శరీరములో నన్ని భాగముల లోనికి రక్తము నంపునదియు మనజీవనాధారసమర్థమై యిది యుండునని యాయుర్వేద సంప్రదాయము) ఆ కమలమందే భగవంతుఁ డున్నాఁడట! ఆ కమలము జ్వాలావళులచేఁ బ్రకాశించుచు ననేకనాడీసమూహాలంబమానమై జీవునకు ముఖ్యస్థానమై కొంచము వికసించిన తమ్మిపూవుతో సమమై (హృదయాగ్రమున) సూక్ష్మముగానున్నదట! అందే "సర్వం ప్రతిష్ఠితమ్" అంతయు నుంచబడినదట, ఆకమలముననే జఠరాగ్ని యను పేరిట వీతిహోత్రుఁ డున్నాఁడట!

ఈతఁడే పదార్థముల జీర్ణింపఁజేయునట! ఈతని కిరణము లాపాదమస్తకముగా శరీరమందంతటను వ్యాపించుటచే యోగులు జరామరణ భయాదులు (యోగమున) లేక సుఖముగా నుందురట! ఆజాఠరదీప్తియే దేహకాంతిని దేహపుష్టి నిడునట! నల్లని మొయిళులలో మెఱుపులవలెనే యాజఠర మధ్యన

సన్న సన్నని మంటల వెలుగు బూర్ధ్వముగా నెగయుచుండు నట !

అది నీవారధాన్యపు ముల్లువలెనే యతిసూక్ష్మమై పచ్చని కాంతితో అణువువలె నున్నది. ఆమంటలమధ్యలో పరమాత్మ యున్నాఁడట ! ఆయనయే బ్రహ్మ- రుద్రుఁడు- విష్ణువు- ఇంద్రుఁడు- నాశరహితుఁడు- కూటస్థుఁడు- అన్నిటికి మూల కారణుఁడనియు స్వప్రకాశకుఁడని వేదము చెప్పుచున్నది. ఇదంతయు వేదాంగమైన యాయుర్వేద ప్రసిద్ధముగనే యున్నది ఇంక- శాస్త్రములు

1 శిక్ష —

పరా- పశ్యంతి- వైఖరి- మధ్యమ- అనివాక్కు- నాలుగు రకములు. ఈపరావాక్కు- గగనమున శబ్దముసకుస్థిగతే నిచ్చు చున్నదనియు, ఇది యోగిజనగోచరమనియు, పశ్యంతికూడ నిట్టిదే ! యనియు ఈరెండు యోగిజనగోచరములుగాని మనకు వినబడవని చెప్పుచున్నది.

వైఖరి శబ్దములఁ బుట్టించునట ! మధ్యమావాక్కు- చెవులకు వినిపించునట ! ఈ వాక్త్రయాధారభూతమైన పరావాక్కు- భగవత్స్వరూపమని శాస్త్రసంప్రదాయము.

II వ్యాకరణము —

పరావాక్కు- భగవద్రూపమని యీశాస్త్రముకూడ అంగీక రించినది. వైయాకరణులకు శబ్దమే బ్రహ్మము. ఆశబ్దము సుష్ఠు ప్రయుక్తమైనచో నది స్వర్గమున కామముల నిడునందురు.

III న్యాయశాస్త్రము —

(శబ్దగుణక మాకాశమ్) శబ్దమునందు శక్తిగలదని వీరి రాద్ధాంతము. ఇందుచేతనే నేడు రేడియోలువగైరాలు పుట్టినవి. ఆకాశమునకు శబ్దగ్రహణశక్తి యున్నదని యానాడే యీశాస్త్రము చెప్పినది. ఒకశబ్ద మాకసమునకుబోయి చాల శబ్దముల సృజించి యొకేకాలమున సర్వత్ర వ్యాపించునట్లుగా భగవంతుడుకూడ సర్వత్రశబ్దరూపుడై ధ్వనిరూపుడై ఓంకారాదిరూపుడై యున్నాడని దీనితో సిద్ధాంతము చేయవచ్చును.

IV గణితశాస్త్రము —

పూర్ణాంకమనగా జీరో! (సున్న) దీనినుండి తొమ్మిదంకెలు పుట్టి గుణించగా ఈపూర్ణాంకము లైనవి. భాగించిన నిందే యణగినవి. అట్లే సత్స్వరూపుడై పూర్ణస్వరూపుడైన భగవంతుడు జగమును తననుండి పుట్టించి తనలోనే లయింపజేసికొనును అని వీరిసిద్ధాంత మనవచ్చును.

V సైన్సు —

"మైన్‌స్విచ్" నొక్కుడో దీపములు వెలుగును. క్రిందికి నొక్కుచో దీపములు తగ్గి మాసిపోవును అట్లే తనశక్తిచే భగవానుడుకూడ జగత్సృష్టి- పాలన- సంహారముల జేయుచున్నాడు. అతనిసంకల్పమే విద్యుచ్ఛక్తివంటిదని వీరివాదము. దీనినే శక్తి యందురు,

VI ఛందశ్శాస్త్రము —

భగవంతు డక్షరస్వరూపుడనియు గణములరూపుడని మనమూహింపవచ్చును.

VII అద్వైతము –

మనలోనుండిన యీజీవుఁడు ఆయీశ్వరుఁడు ఒకటియే యని మాయావరణముచే మనము తెలిసికొఁజాలకున్నామని యీశాస్త్రసారము.

VIII ఇంక కొరాన్–మతగ్రంథము –

భగవంతుఁడొక్కఁడే! అంతయు నశించినను ఆయన నసించడు. నీ వెప్పటికైన ఆయనదగ్గఱకు దేఁబడుదువు.

20 భా–28, అ. 9 వి. 88 చ.

2– ఆ దేవుఁడే రాత్రివేళ మీ యాత్మలను స్వీకరించుచున్నాఁడు. ఆయనయే ప్రొద్దుట మరల లేవదీయుచున్నాఁడు. మీరందఱు చేరవలసిన దాయనదగ్గరకే! 7.భా–అ–7–వి.

IX బైబిలు (మతగ్రంథము.)

మనుష్యుఁడు రొట్టెవలననే జీవించుట లేదు. భగవంతుని నోటవచ్చు ప్రతియాజ్ఞచేతను జీవించుచున్నాఁడు.

కాన నాయనలారా! భగవంతుఁడు గలఁడని నమ్ముఁడు. ఆయనను జేరుటెట్లని మఱియొక ప్రశ్నయా! మీకు పుట్టినది మొదలు చచ్చువఱకు ధనధాన్యములకొఱకుఁ బుత్రపౌత్రుల కొఱకు భార్యలకొఱకు ఉద్యోగములకొఱకు జబ్బుపడిన మీ సాని యారోగ్యముకొఱకు మధుమాంససేవనముకొఱకు పరీక్షలలో మీపిల్లలమార్కులకొఱకు నేడ్చెదరుగాని శ్రీరామ కృష్ణపరమహంస మున్నగునారు చెప్పినట్లుగా దేవుని దర్శనమునకై యొక్కఁడయిన నేడ్చుచున్నారా? దేవుని జూపుమని యెవరికైన లంచములిచ్చి ప్రార్థించుచున్నారా? ఎవరినైన తెలిసినవారి నాశ్రయించుచున్నారా? పసిపిల్ల యేడ్చువఱకుఁ

దల్లికూడ పాలీయదే! గుడ్డలుచిఱిగినవని యేడ్చువఱకు బిడ్డల కైన గుడ్డలగానమే! ఆడుపిల్లలవెంటనంటి జడలు లాగువఱకు మనపిల్లవానికిఁ బెండ్లిచేయ యోజించమే!

తనకై యేడువని సేవించని పూజించని మీకుమాత్రము భగవంతుఁ డేలగనుపించును? అహోరాత్రము లాభగవంతు నికై పరితపించి కనిపించవేమయ్యా! యని యేడ్చి మొత్తుకొని దొర్లిదొర్లి వెక్కి-వెక్కి యేడువుము. ఆతఁడు నీకు గనిపించి తీరును. అహంకార మమకారముల దెగఁగోసి మఱి యేడు- ఆతఁడు తప్పక కనిపించి తీరును.

ఓంశాంతి శ్శాంతి శ్శాంతిః.

---

# భావతరంగములు

## 2. వేదములు

నాయనలారా!

వేదయతి స్వామిని వేదః—అంతను దెలుపునదని వ్యుత్పత్తి—అంతముననగా దేనినని సందేహము కాబోలు!

శ్లో॥ ప్రత్యక్షేణా నుమిత్యా వా
యస్తూపాయో న బుద్ధ్యతే
ఏనం విందన్తి వేదేన
తస్మాద్వేదస్య వేదతా

నాయనలారా! చక్రాలంత చింతాకులంత కన్నులు మనకు గలవు. వానికి వెనుకనే బుద్ధికూడ గలదు— మనకన్నులకు ఇది ఇల్లు= ఇదివాకిలి— ఇదిచెంబు— ఇదిముంత అనికనపడును. ఈ కన్నులు చూపువస్తువులగూర్చి వేదములుచెప్పనక్కఱ లేదు గదా!

మఱియు నేటివలెనే రేపువచ్చును. నిన్నటివలెనే నేడుపూర్తి యగునని యనుమాన (ఊహా) ప్రమాణముచే దెలియవచ్చును. వంటయింటిలోనుండి పొగవచ్చుచుండగా లోన నిప్పున్నదని యూహించుచున్నాముగదా! కాన అనుమానప్రమాణముచే దెలియదగినవస్తువులఁగూడ వేదము బోధించనక్కఱ లేదు గదా!

కాన ప్రత్యక్షానుమానప్రమాణములచేఁ దెలియదగిన విషయముల వీడి యితరవిషయములనే వేదము బోధించును. మనకంటికిఁగన్పడక మనబుద్ధికి దోచక యుండువిషయములలో మనకుఁ దెలియఁదగిన వేముండునని యొక ప్రశ్న కాబోలు!

నాయనలారా! శత్రువులు బలవంతులు- వారి నెట్లు సుల భముగా జంపనగును? అనగా వేదము శత్రుమారకేష్టుల సలుపుమనును. సంతానము లేదు. వంశాభివృద్ధి యణగిపోవు చున్నది. ఇప్పుడేమి చేయవలెనన్న పుత్రకామేష్టి యను యాగము చేయుడని వేదము బోధించుచున్నది.

అట్లే వేసవియెండలు మండిపోవుచున్నది. అట్టియెడ వాన కురిపించినచో పంటలుపండును. లేకపోయిన జనులెండిపోవుదురు. ఇది సంఘవిషయము, ఇటువంటప్పు డేమి చేయవలె ననునది ప్రత్యక్షానుమానములతో తేలునదికాదు. కాన వేదము వరుణజపముచేసిన వర్షముకురియునని బోధించుచున్నది.

ఒకయిల్లాలు కాన్పురాక ప్రసవబాధనొందుచున్నది. ఆమె చనిపోవునేమోయని వైద్యులు చెప్పుచు నాలుకలుచప్పరించిరి. అట్టిస్థితిలో ఏమిచేయవలెనో! ప్రత్యక్షానుమానములతోఁ దేలుసంగతికాదు. అప్పుడు అరుణము, అను వేదములోని మంత్ర జపముచేసి యాతీర్థ మామెకిచ్చినచో ఆమెకు సుఖప్రసవము కలుగునట! ఇట్టివానినే వేదమాత మనకు బోధించును.

భగవంతుని యాకారమేమి? ఎక్కడున్నాఁడు? ఆతని దెలియుట గొలుచుటయెట్లు? అనగా "అంత ర్బహిశ్చ తత్సర్వం అణో రణీయాన్, మహతో మహీయాన్" మున్నగు మంత్రముల ద్వారా వేదము సమాధానము చెప్పుచున్నది.

కావుననే వేదములో కొంతభాగము కర్మకాండగాఁ గొంత భాగము (ఉపనిషత్తులు మొ॥) జ్ఞానకాండగా విభజించబడినది. ఈరెండుకాండలుకూడ మానవ సమాజశ్రేయస్సుకై యేర్పడి నవి. మోక్షప్రదానమునకై యేర్పడినవి. స్వర్గాది పుణ్యలోక ప్రాప్తికై యేర్పడినవి.

అయ్యా! వేదము లెప్పుడుపుట్టెనో! మాకుఁదెలియదు. ఎవరో వ్రాసిన గ్రంథమును మే మెట్లునమ్మెదుమని నొక చప్పని చెప్పదగు ప్రశ్నయా?

వేదములు శబ్దస్వరూపములు- ఆశబ్దము లాకసమున విరాజిల్లుచుండును. ఈశబ్దస్థానమున వాయువు స్తంభించియుండు నట! (శబ్దగుణక మాకాశమ్) అను వాక్యము దీని కుపస్కారముగా నున్నది. అచ్చటనున్న అనంతశబ్దజాలము యోగులకు వినిపించును. ఇతరుల కది వినబడదు కనబడదుగదా! ఈశబ్దము లన్నియు గాయత్రీ-త్రిష్టుప్- జగతీ-ఛందములలో మంత్రరూపములుగా నుండును- వానినివిని తెలిసినవారే మంత్రద్రష్టలైన విశ్వామిత్రుఁడు. భరద్వాజుఁడు మున్నగు మహాత్ములు. వినుటచే గ్రహించబడినవి గాన వీనికి శృతులని పేరువచ్చినది.

వీనిని నీవు నమ్మిన నమ్ముము. లేకున్న మాకవసరము లేదు. నీతండ్రి యెవఁడో! నీతల్లి నీకు జ్ఞానమువచ్చినపిదప "ఈమహానీయుఁడే నీతండ్రియని, నేనే నీతల్లినిరా!" అనిన నమ్మగలవు.

పాపము నీజన్మదిన మెన్నఁడో! పెద్దలుచెప్పిన నీవు నమ్మగలవు!

ఈకాల మిటులెంతకాలమునుండి జరుగుచున్నదో యీ సూర్యోదయ సూర్యాస్తమయము లెన్నటినుండి జరుగుచున్నవో మానవులైన పెద్దలు చెప్పిన నమ్మజాలవు.

ఈమె నీసోదరి గాన పెండ్లాడఁగూడదురా! ప్రేమించ రాదురా! దుర్మార్గుఁడా! అని చెప్పిన మానవమాత్రుల మాటలు నమ్మజాలవు.

వెఱ్ఱినాయనా! వేదము గ్రంథమైనదా? దానిని నీవు నమ్మ జాలవా?

ఇట్టివాఁడ వింతనాస్తికుఁడ వేమి నమ్ముదువు? నీభార్య తక్కుచు దఱుక్కుమనుచు "నీతల్లి మంచిది గాదు. నీతండ్రి మంచివాఁడు కాఁడు. వారి నింటినుండి గెంటివై మాతలిదండ్రుల గానిరమ్ము. వారిని పోషించుటచే నీకు పుణ్యలోకాలు పుట్ట కొనవచ్చునని" కల్లబొల్లి యేడ్పులతో గారాము మారాము చేసి మూఁసంకెవేసి యుపదేసించినచో ఆమాటలు నమ్మగలవు గాని వేదమాత చెప్పు వాక్యములు నీకు నమ్మకమా?

నీకు రోగమువచ్చిన పిల్లలుగలుగకపోయిన దరిద్రము వచ్చిన ఉద్యోగమూడిపోయిన కఱవుతో దేశముపాడై పోవు చున్న నీభార్య యేమిసలహా ఇచ్చి యీలోపము లెట్లు పూర్తిచేయునో! అడిగిచూడు—ఆమె యేమనునో విందము.

దుస్సహావాసముచేసి పాడైన నిన్ను బాగుచేయుఁడని ప్రార్థించు స్నేహితులు అమిత్రరత్నము లొక్కరైన గాపాడి నీదుర్గుణములమాపి నీపాడును బాడుచేసి నీ బాగును బాగుచేయ గలరేమో చూతము.

సకలలోకాధారమైన వేదమాతను నమ్మకపోవుట నీకర్మ యే! నీతల్లిమాటలు వినక కృత్రిమురాలైన నీయాలిమాటలు విని పాడగుకొమ్మ నీ మొగమున నుండిన నిన్నెవరు బాగుచేయ గలరు?

పైగా ఎవరో వ్రాసినగ్రంథమా? వేదము? ఎవరువ్రాసిరో! వెనుక జెప్పితిని. నీకుఁ దెలియలేదా? అరణ్యములలో చెట్లనెవఁడు నాటుచున్నాఁడు? రాత్రిలోనీకప్పు కెవఁ

డాహార మిడుచున్నాఁడు? నీభార్య గర్భమును స్రావము కాకుండగా ఎవఁడు కాపాడుచున్నాఁడు? నీకొమరునకుద్యోగము ఆయువుల నెవఁడిచ్చుచున్నాఁడు? నీకాపద రాకుండగా ఏయంత్ర- వాహనాదిప్రమాదము కలుగకుండగా నెవఁడు కాపాడుచున్నాఁడు? ఆశక్తిరూపుఁడైనవాఁడే వ్రాసినాఁడు- ఆదేవుని ముఖమునుండియే వేదము వచ్చినవి.

మహాప్రళయాదులలో సంతతియు మన్నుమశానముగా మారినతరువాత నీకుమిగిలిన దొక వేదమే గదా! నీ నెవరో వ్రాసినారా? ఇవ్వి పౌరుషేయములా? మనపౌరుషము పిల్లల గనుటలో లేదు. భగవంతుని సేవించుటలో లేదు. రోగములు బాగొనర్చుకొనుటలో లేదు. నువిల్లలకు మంచిమాటలతోఁ జదువువచ్చుటలో లేదు. వేదసృష్టిలోమాత్రము పౌరుషము వచ్చినదా?

శబ్దము బ్రహ్మస్వరూపమైయు ఓం అను నేకాక్షరమే బ్రహ్మ యైయు ఆకాశము భగవంతుని శిరస్థానమైయు నీవు విని యుండవు. భగవంతుఁడనిన నమ్మిక నీ కేది? సైన్సు! సైన్సు! సైన్సు! మారణాస్త్రముల తయారించుటతో నీ సైన్సు సమాప్తమైనది. రాత్రులందు నీపిల్లలకు భయంకరముగా నిద్దురపట్టకుండగా నక్కలు కుక్కలు కూయుచుండగా వారించు టెట్లో! నీసైన్సేమైనను జెప్పినదా? నీ మంచికోఁడుగాని కండువాకోఁడుగాని చీరకోఁడుగాని యింటనున్న వారెవ్వరైన జివర ముసైచి బిగించినచో ఆకూత లాగిపోవును? ఆభయము పోగొట్టె యామయమును గదా! ఏది? నీసైన్సునస!

సూర్యుని కిరణాలలో 7 రంగులున్నవని సైన్సుతోఁగని పెట్టితినని చంకలు బాదుకొనుచున్నావు? నీజబ్బలు నెప్పులు పుట్టును. నెమ్మదిగా బాదుకొనియాగు. ద్వాదశవర్ణకరాయ నమః. అని పన్నెండురంగులు సూర్యకిరణాలలో నున్నట్లు సూర్యసహస్రనామములు నేటికి సాక్ష్యము లిచ్చుచున్నవే! ఏదీ నీసైన్సుమజా ?

ఆగుమాగుము. బిక్కమొగమువైచి పోజుచెదవేల? వృక్షములలోఁ బ్రాణములున్నవని మేము కనిపెట్టినామని వీఁకవీఁకుచున్నావు.

ఆపోమయఃప్రాణః— నీటిచే జీవించునవే ప్రాణములుగలవని శాస్త్రఘోష—వేదఘోష.

శ్లో॥ అంతస్సంజ్ఞాః భవన్త్యేతే సుఖదుఃఖసమన్వితాః

అని మామనుస్మృతికారుఁడు చెప్పుచున్నాఁడే! ఏదీ! క్రొత్తగా నీవుకనిపెట్టిన సైన్సుతమాషా! చూపు.

మరియు నేదిక్కుగాఁ దలయుంచి రేలు పరుండవలెనో? తల్లిదండ్రుల సేవవలన నేమిలాభమో! పెద్దల నెట్లు పూజించవలెనో! గురుసేవ యెట్లు చేయవలెనో! ఇందలి లాభము లేమో! ఇంటి నెట్లు నిర్మించుకొనిన సుఖముగలుగునో! నీసైన్సేమి చర్చించినది? తెలియవలసిన మానవవిషయములు చాలగలవు! వేదములలో— వాటిని మానవులుగాని యితర జంతుప్రాయు లెట్లు నమ్మెదరు?—

ఏమనుచున్నావు? యుగాంతర విషయములే వేదములు బోధించుచున్నవి. ప్రళయములో నివ్వి యెట్లు బ్రతికి బట్టకట్టినవనియా ?

భగవంతునియందుండు వేదమాతను ప్రళయానంతరమున మీతపశ్శక్తులచే గ్రహించి ప్రచారము చేయుడని భగవంతుఁడు మునుల నాదేశించును.

శ్లో॥ యుగాంతేఽంతర్హితాన్ వేదాన్
సేతిహాసాన్మహర్షయః
లేభిరే తపసాపూర్వ
మనుజ్ఞాతా స్స్వయంభువా!

అని విన్నావుగాదా! ఏమనుచున్నావు? బ్రాహ్మణులకే వేదాధికారమని యాక్షేపించుచున్నావా? విను-

విద్యాదేవత బ్రాహ్మణునియొద్దకు వచ్చి ఓయీ! నన్ను నీవు భద్రపఱచుము- ఈలోకమునకు నేనే నిధిని! నీకు సమస్త శుభముల నిడెదను- అసూయావిష్టులు కుటిలమనస్కులు నియత ప్రవృత్తిలేనివారు నాస్తికులు పలువురుగలరు. అట్టియపాత్రులకు నన్నందనీయకుము- అని బోధించుచున్నది.

విద్యాహివై బ్రాహ్మణమాజగామ
గోపాయ మా శేవధిస్తేఽహమస్మి
అసూయకాయ అనృజవేఽయతాయ
నమాబ్రూయా వీర్యవతీతథాస్యామ్.

సత్త్వగుణప్రధానమై మునివంశసంజాతమై బ్రహ్మముఖోద్గతమై యధీతిబోధాచరణప్రచారణ వృత్తికమై కర్మకరణదక్షమై జ్ఞానవైరాగ్య ప్రవృత్తికమై భిక్షాటనప్రధానమైనది బ్రాహ్మణజాతి. అందుకు వ్యతిరిక్తులను బ్రాహ్మణు లనకుము. బ్రాహ్మణ బ్రువులనుము.

అట్టి వేదవిహిత బ్రాహ్మణ్యము గలవానియందు సకల దేవతలు వసియించెదరుగాన వారికి నమస్కరింపుడని, వారివల ననే జ్ఞానవిషయములఁ దెలియుమని యీ వేదమాత బోధించు చున్నది. శృతి॥ సర్వా దేవతాః వేదవిది బ్రాహ్మణేవసన్తి- తస్మాద్బ్రాహ్మణేభ్యో వేదవిద్భ్యః దివేదివేనమస్కుర్యాన్నార్యా లంకీర్తయేత్ ...ఏతాఏవ దేవతాః ప్రీణాతి.

అట్టి వైదికునకు నమస్కరించినమాత్రాన సకల దేవతలు సంబరపడియెదరట !

ఇంక నిందలి విషయమా ?

ఋగ్యజుస్సామాథర్వాణ రూప వేదమంతయుఁ గర్మజ్ఞాన కాండలని రెండు విభాగములు- ఉపనిషత్తులు బ్రహ్మజ్ఞానము- తద్ద్వారా ఆత్మసాక్షాత్కారమును బ్రసాదించును, ఇవి జ్ఞాన కాండములోనివే! వీనిని సమన్వయపఱచి శ్రీ శంకర భగవ త్పాదులు భాష్యమును వ్యాసుఁడు బ్రహ్మసూత్రముల వ్రాసి నారు. జైమినిధర్మసూత్రముల ఆశ్వలాయన మహర్షి శ్రౌత సూత్రముల ఆపస్తంభుడు గృహ్యసూత్రముల వ్రాసినారు. చివఱకు విద్యారణ్యభాష్య ముదయించినది- సాయణుఁడు సేతిహాసముగా వేదభాగములనన్నిఁటికి భాష్యము వ్రాసినాఁడు.

మాధవవిద్యారణ్యుఁ డనుభూతి ప్రకాశనముచే వేదాంతా ర్థముల నిరూపించినాఁడు. తైత్తిరీయోపనిషత్తునకు వ్యాఖ్యా నముకూడ వ్రాసినాఁడు. అతని గురువు శంకరానందుఁడు "ఉపనిషద్దీపిక" యను గ్రంథము వ్రాసి యుపనిషత్తుల కర్థము వ్రాసినాఁడు. కర్మనాచరించుటకు గృహస్థులకే యధికార మున్నదనియు జ్ఞానమునకు సన్న్యాసులే యర్హులని బోధించిరి.

వేదపూర్వకాండ (కర్మ) లో యజ్ఞములు. దేవతోపాసన క్రియలు- ఫలప్రదదేవతామహిమలు. యాగోపకరణములు. యాగవిధానములు. యాగఫలములు. పర్వములు గలవు- అందును ఋగ్వేదమున సంహితాభాగమే అధికము. సామమున గీతకుఁ బ్రాధాన్యముగలదు ఇదియే సంగీతమునకుఁ బుట్టిల్లు గదా! ఈపూర్వభాగముననే నిత్య-నైమిత్తిక-కామ్య-నిషిద్ధ కర్మలు గలవు.

(యావజ్జీవాగ్నిహోత్రములు- స్నాన-సంధ్యావందనములు) నిత్యములు- (యాగములు- శ్రాద్ధములు- మున్నగునవి) నైమిత్తికములు-కర్మకాండము నిత్యనైమిత్తికవిధిని బోధించి ఆ యాకర్మలఁ బ్రవర్తింపఁజేయును- పశుసంపద కోరువాఁడు చిత్రాయాగమును జేయవలెను. మున్నగు కామ్యకర్మములు గలవు.

ఇంక జ్ఞానకర్మము- ఇదినాల్గవ పురుషార్థము మోక్షమును బ్రసాదించి తిరిగి జనువునీయదు. బ్రహ్మజ్ఞానికి దేహపాతానంతరము సద్యోముక్తి గలుగునట! దీనినే క్రమముక్తియందురు- కర్మలుచేసి తద్ద్వారా చిత్తశుద్ధినంది దానిచే ముక్తి నందుట క్రమముక్తి.

అం తెందుకు: బాల్యమునుండియే జ్ఞానమునందరాదా? దానివిమ్మట ముక్తియేగదా! కర్మల నాచరించుట యెందుకని కొందఱందురు.

కాని యది ఫలకారికాదు. కాన "ఇతిచేన్న" అనినారు. అక్షరాభ్యాసకాలముననే M. A. కోర్సు బోధించి చెప్పినచో పదేండ్లు వచ్చుసరికి బాలుఁడు కళాశాలలో నాచార్యపదవి నందును. మొదటినుండియు నేల బోధించవలెను?

అటువంటియెడ నే బాలికకు పెండ్లి, కార్యము చేసినచో 9-10 ఏండ్ల ప్రాయము వచ్చుసరికామె 3-4 బిడ్డలనుగూడఁ గనును గదా ! ఏల చేయరాదు ?

పునాదు లక్కర లేకుండగా పదంతస్తుల మేడ నేలపైన గట్టి నచో వ్యయము, శ్రమ, కాలహరణము తగ్గునుగదా ! అట్లే కట్టించుము.

నాయనా ! అట్లు నీవుచేయఁగలిగినచో కర్మ లేకుండగా జ్ఞానివి కాగలవు. ఆలోచించుము.

కర్మమాని నీవు భజనలు వగైరాలు చేసినను అవి ముక్తి నీయఁజాలవు.

కాని వేదము సుఖసుఖాల అర్థముకాదు.

I వనస్పతయః సత్రమాసత-
చెట్లు సత్రయాగము చేసినవి.

II కశ్చిదేకాకీచరతి? కఉస్విజ్జాయతే పునః ?
చంద్రమాజాయతే పునః ?

III అగ్నిమీళే పురోహితమ్
పురోహితుఁడైన యగ్నిని బొగడుచున్నాను.

మున్నగు వాక్యములు తెలియనివారికి పిచ్చివారిమాటల వలెనే యుండును. ఈ వేదార్థము దురవగాహమనియే పలువురు మంత్రద్రష్టలు స్మృతుల వ్రాసిరి. ఈ వేదము లలోనుండు విషయములే యాస్మృతులలో శ్లోక-సూత్ర రూపాల నున్నవి. ప్రతివారికి ఈ వేదమర్థముగాదఁ యే-

1. స్వరప్రధానశిక్ష, 2. శబ్దసాధుకతాబోధకమయిన వ్యాక రణము 3. షడ్వింశతిఛంధములబోధించు ఛందము 4. వేద

నిఘంటువైన నిరుక్తము 5. కాలజ్ఞానబోధకమైన జ్యోతిషము 6. శ్రౌత- గృహ్య- ధర్మసూత్రబోధకమైన కల్పము- అని యాఱంగములు గలవు. ఈసాంగ వేదాధ్యయనము చేయవలెను.

ఔదుంబరాయణుఁడు, ఆగ్రాయణుఁడు, కౌత్సుఁడు, గార్గ్యుఁడు, గాలవుఁడు- మున్నగు మహర్షులు సంప్రదాయ ప్రవర్తకులు గలరు.

నాయనలారా! ఈవేదము లెవలెవరివలన నెవరికి వచ్చిన వని యొక ప్రశ్నయా?

బ్రహ్మ బృహస్పతికి నాతఁడు శిష్యుఁడైన యింద్రునకు అతఁడు భరద్వాజునకు అతఁడు ఋషులకు వారు బ్రాహ్మణు లకు బోధించినారు. ఈవేదమును రాత్రిభాగమున జెప్పరాదు. పగలే దీనిని గురువులు శిష్యులకు బోధించెదరు.

బ్రహ్మబృహస్పతయే ప్రోవాచ- బృహస్పతి రింద్రాయ ఇంద్రో భరద్వాజాయ-భరద్వాజఋషిభ్యః ఋషయో బ్రాహ్మణేభ్యః- నసక్తం ప్రబ్రూయాత్ -బ్రహ్మరాశిరితి-

ఇవ్వి నాలుగు వేదములుగా మనమహర్షులు గ్రహించినారు- అథర్వణవేదము నూటయొకశాఖలుగలది. సామము వేయి శాఖలు - ఋగ్వేదము 9 శాఖలుగలది. యజుర్వేదము ఇరు వదియొక శాఖలు - దీనినుండి వాక - వాక్య - ఇతిహాస - పురాణాదులు పుట్టినవి.

ఈవేదములెప్పుడు జన్మించినవందురా?

నాయనలారా!

మన విమర్శకాగ్రేసరులు ఆంగ్లేయవిమర్శకులు క్రీస్తు పూర్వము 5వశతాబ్దినాటికే వేదములు జన్మించినవందురు. పరు

నాల్గవశతాబ్దిలో బ్రాహ్మణులు పడమర సముద్రతీరమున గూర్చొని వేదములు వ్రాసినారని మనబాలుర చారిత్రిక గ్రంథాలలోనెక్కి బాలురగొంతుకలలో నూరిపోయబడుచున్నవి—వారు విమర్శించివిమర్శించి 50 వేల సంవత్సరాలకు పూర్వము నాటికే వేదములున్నవనియు అంతకుఁబూర్వ మెన్నడు జన్మించిన నో యూహకందుట లేదని విమర్శకులు సిద్ధాంతీకరించిరి. సనాతనులందఱు వేదాలు స్వయంభువములన్నారు.

పైగా ఋగ్వేదములో

శ్లో—ఋగగ్నేరజాయత – వాయోస్సామ వేదః॥

అని అగ్నివలన ఋగ్వేదము వాయువువలన సామవేదము ఆదిత్యునివలన యజుర్వేదముపుట్టినవి – వీటికర్థము సంప్రదాయజ్ఞులవలన దెలియదగినవని వెనుకనే చెప్పితిని. వేదములో మంత్రభాగము, అపౌరుషేయము, బ్రాహ్మణములు (వానిపేరు ననుసరించి) పౌరుషేయములని దయానందసరస్వతి వాదించును.

కాన వీటి జననాదులచర్చలు ప్రాజ్ఞులకు తితీక్షువుల కక్కర లేదు. కాన జీవనప్రాయమ్ములైన వేదములనమ్మెదు – వేద గౌరవమే భారతదేశమున కితర దేశములలో గౌరవము సంపాదించినది. వే ద ని య మ ము ల వైదికనాగరికతగల మన ఋషుల మనలఁజూచి యితరులలో బుట్టజాలనందుకు విచారించువారు మనలో గలరు.

మనకుఁబెద్దలైనమహాత్ములు లేయింబవళులుశ్రమపడి తపస్సు చేసిసంపాదించియిచ్చిన స్థిరాస్తివేదనిధియే! స్త్రీ పురుషులలో గట్టుబాటులు ధర్మములు న్యాయములు నియమములు వేదానుసారములే! వాటినిందాక యుల్లంఘించక జరుపుకొని

సంఘశ్రేయస్సు, వ్యక్తి స్వాతంత్ర్య వికాసముల, నిలిపినాము. నేడన్యదేశీయనాగరికతఁజూచి వేదబాహ్యులమై మనజాలము—కాన వేదతిరస్కారము బహిష్కారముల నెఱవేర్చి మాతృద్రోహము దేశద్రోహము లాచరించి యపకీర్తినందకుండుఁడు, మనము ప్రయత్నించి నాస్తికతను. అన్యమతసిద్ధాంతముల ప్రచారముచేయుచు దేశమును భ్రష్టమొనర్చుచున్నను ఎవరో యొకరొకమూల వైదికప్రచారము సాగించుచునేయుందురు.

ఓం తత్సత్.



# ఛందస్సు (౩)

నాయనలారా! మూఁడవ వేదాంగము ఛందస్సు -

ఛందాగ్ంసి జజ్ఞిరే తస్మాత్ -

అని యావేదమునుండియే ఛందస్సు పుట్టినది. వేదాంగము వేదోద్భవముగాన దీనికి ఛందస్సను పేరు అరాయించక యింకి పోక యిట్టే యతికినది - వేదమంత్రములలో నున్నవి గాయత్రీఛందస్సు త్రిష్టుప్ఛందస్సు జగతీఛందస్సులు. ప్రతి మంత్రము పైమూఁడిటిలో నేదో యొకదానిలోనో యున్నది. ఈ మూఁడిటిని ప్రస్తరించగా నిఱువదినాల్గువేల వృత్తములు పుట్టినవి. ప్రతిమంత్రమునకు నొక ఛందస్సు నొకయుపద్రష్టయైన ఋషియునుండును. చూడుఁడు - గాయత్రీ మంత్రములో.

గాయత్ర్యా గాయత్రీ- ఛందః- విశ్వామిత్రఋషిః సవితా దేవతా అగ్నిర్ముఖం -

అని గాయత్రీమంత్రము గాయత్రీఛందస్సులో నున్నదట. దీనికి విశ్వామిత్రుఁడు ఋషి ఈమంత్రమును గనిపెట్టినవాఁడన్నమాట ఇది సవితృదేవతాకమట! దేవతాగణము ముఖమట! 24 అక్షరముల పరిమాణమట! అన్ని మంత్రములనిట్లు ఛందస్సుననే దేవతలచే నక్షరసంఖ్యలచే బిగించినారు గాన నేటికి నభేద్యములై వేదమంత్రములు విరాజిల్లుచున్నవి. లేకపోయిన పురాణాదులలోవలెనే నీచులు వీనియందు స్వంతపదములఁ జేర్చెడివారే! బ్రహ్మముఖోద్గతమైన వేదమానాటినుండియు

నేటివఱకు నట్లే స్వరాదివినిమయము లేక మాత్రాలేమియు లేక యున్నది. కొన్ని స్వరములుగాని కొన్ని యక్షరములుగాని కలిసిన నొకగణము పుట్టును. కొన్ని గణములుగలదొక పాదమగును– కొన్ని పాదములు గలదొక వృత్తముగానగును.

ఈ వృత్తములన్నియుఁ బైమూఁడు వృత్తములనుండి పుట్టినవియే! ఇవియే మందాక్రాంతా– అనుష్టుప్– మొదలగు శ్లోకములుగాఁ దయారయినవి.

ఈ వృత్తములుగల శ్లోకములు సంగీతశాస్త్ర సాహాయ్యమున సుఖముగా గానముచేయుటకు జ్ఞాపకముంచుకొనుటకుపకరించును

ఈ గణములు సూర్య. అగ్ని. వాయు. వరుణాది దేవతాఫలకములట! ఇందుకొన్ని గణములకలయిక శుభప్రదమనియుఁ గొన్ని గణముల యక్షరముల కలయిక యశుభప్రదమనియుఁ గొన్నిటికలయిక శుభాశుభ మిశ్రఫలదాయకమనియుఁ జెప్పుదురు. వేదములోనుండె పుట్టి ప్రస్తారమువలన నుద్భవించినదీ శాస్త్రము.

నాయనలారా! దీనివలన లాభమేమిటని యొక ప్రశ్నయా? ఈ ఛందోబద్ధకవిత జ్ఞాపకముంచుకొని తద్ద్వారా ధారణాశక్తిని బెంపొందించుకొనుటకుఁ దద్ద్వారాభాషను ముఖస్థ మొనర్చుకొనుటకు నుపయోగించును.

మరియు నొక్కొక్కరసమున నొకొక వృత్తమును వాడినచో ఆరసోద్రిక్తతగలిగి యానందమునిచ్చును. ఈ శాస్త్రము తెలుపు షడ్వింశతి ఛందములమూలమున నీపురాణ కావ్యశాస్త్రమయమైన భాషవర్ధిల్లి లోకోపకార మొనర్చుచున్నది. వేదమంత్రము

లలో "యతి" వలనే యిందును విశ్రాంతి లేక యతియుండును. ప్రతివృత్తమున యతిగలదు.

కాన దీనిరక్షణమువలన చాలలాభములు, దీనినివీడుటవలనఁ బలు చెడుగులుకూడఁ గలవు—

ఓం తత్సత్—



# శిక్ష

వేదపురుషునకు అంగములు ఆఱు. శిక్ష -వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము- అనే యీ అంగాలను తెలిసినవారే వేదార్థమును జెప్పుటలో సమర్థులు. అందుకే మీమాంసాన్యాయప్రకాశికలో —

షడంగో వేదో ऽ ధ్యేతవ్యః —

అన్నారు. ఓయీ ! మన శరీరములో నుండి పైకి మాట వచ్చుచున్నది గదా ! అందుకు లోపల నేమయినను ప్రయత్నము జరుగుచున్నదా ? లేక స్వభావము (natural) గా వచ్చుచున్నదా ?

అనగా మన శరీరములో ... ఆభ్యంతరము, బాహ్యము రెండు ప్రయత్నములు గలవు -సిద్ధాంతకౌముదిలో—

యత్నో ద్విధా - ఆభ్యంతరో బాహ్యశ్చ-అంటాడు. అనగా మన శరీరములో ఆత్మ గలదు — ఇందులోనే మాట్లాడవలెను. వద్దు- అనే విధి నిషేధముల సంకల్పము కలుగును. దీనికి విమర్శనాశక్తి లేదు. సంకల్పించుట మాత్రమే ఆత్మయొక్క పని. ఆయాత్మ విమర్శనాశక్తిగల బుద్ధియొద్దకు బోయి యాసంకల్పితవిషయములను దెలుపగా ఆ బుద్ధి విమర్శించి ఇది మాట్లాడుము, ఇది వద్దని నిషేధించును. అనగా బుద్ధి యొక ప్రణాళిక తయారుచేయునన్న

మాట. ఎట్లనగా - యజమాని ధనము సంపాదించి తెలివి గల తన భార్య కీయగా నామె యొక ప్రణాళిక ప్రకారముగా ఆ ధనము వ్యయము. ఆదాయములను జేయునుగదా ! పైగా ఆమెయే సేవకులద్వారా గృహకృత్యములను జాగరూకతతోఁ జేయించును. అట్లే బుద్ధి విమర్శించి ఆ వక్తవ్యాంశమును మనస్సున కందజేయును : ఆ మనస్సు సచ్ఛేవకుఁడు వలెనే చురుకుతనము గలది : అది ప్రక్కనేయున్న జఠరాగ్ని ని గొట్టును ; ఆ యగ్ని యొక్క తాడనముచే ఒకగాలి పుట్టి పైకి వచ్చును ; అదట్లు పైకిపోయి కపాలముచేఁ గొట్టబడి క్రిందకు వచ్చి ముఖములోఁ (నోటిన్నుంచి) బయిటవేసించును. (ఇంతవఱకు నీ కంఠము లోపల జరుగునదే యాభ్యంతర ప్రయత్నము) ఆఫీసరుగారి వాకిట సేవకులు వలెనే-మన నోటిలో వర్ణములను బుట్టించుటకై 8 స్థానములుగలవు. కంఠము, తాలువు, శిరస్సు దంతములు, ఓష్ఠములు, ముక్కు, కంఠతాలువు, కంఠోష్ఠము, జిహ్వామూలీయము, అంతోష్ఠములు-అని. ఈ స్థానముల స్పర్శ, సిబిడస్పర్శ, లఘుస్పర్శల వలన వర్ణములు పుట్టుచున్నవి. మన తెలుగుభాష కొకదానికే 56 అక్షరములు. మిగిలిన భాష లన్నింటికి నింతకన్న తక్కువ యక్షరములే. ఈ విషయములను షడంగములలో మొదటిదైన శిక్ష యిట్లు చెప్పుచున్నది.

శ్లో॥ ఆత్మా బుద్ధ్యాసమే త్యార్థాన్ మనోయుంక్తేవివక్షయా
మనః కాయాగ్ని మాహన్తి సప్రేరయతి మారుతమ్
మారుత స్తూరసి చర న్మందం జనయతి స్వరం
సో உ దీర్ణో మూర్ధ్న్యభిహితః వక్త్రమా పద్యమారుతః
వర్ణాన్ జనయతే. . . తేషాం విభాగః పంచధా స్మృతః

కంఠమునుండి వచ్చు గాలియే ధ్వనిగా మారి తాల్వాదిస్థానముల సాయమున మనకు గావలసిన అక్షరరూపముగా బైటకు వచ్చుచున్నదని భావము—

మరియు మనముఖమునుండి వచ్చుచుండుస్వరము నిద్రపోయి లేచినపుడు, అర్ధరాత్రిమున, మిట్టమధ్యాహ్న సమయములు, సాయం - ప్రాతఃకాలములయందు మారుచుండును. ప్రాతఃకాలమున వచ్చు స్వరము గాయత్రీఛందస్సులో గానము చేయుటకు, అర్ధరాత్ర-మధ్యాహ్నముల వచ్చు స్వరము త్రిష్టుప్ ఛందస్సులో గానము చేయుటకు, మిగిలిన కాలములో వచ్చుస్వరము జగతీఛందస్సులో గానము చేయుటకును ఉపయోగించును. కాన పైస్వరములనుండి పై ఛందస్సులు పుట్టినవి. ఈఛందస్సులను 2 చే పరిస్తరించగా 24 వేల వృత్తము లేర్పడినవి. వీనితోనే ఛందశ్శాస్త్రము తయారయినది. వేఱువేఱు కాలములలో మన స్వరమును రికార్డు (Record) చేసి విన్నచో నీ భేదము తెలియవచ్చును.

వేదములో స్వర మెందుకు ? అది లేకుండగా నుచ్చరించినచో నష్ట మేమని యొక ప్రశ్న —

1. స్వరమునుబట్టి సమాసాదులు, వాని ననుసరించి యర్థములు, శబ్దములు మారుచుండును. అట్టి మార్పులు రాకుండుటకై స్వరము కావలెను.

2. కాలక్రమమున నుచ్చారణములో వర్ణ వ్యత్యాసము వచ్చును. ఉదా : 'నారాయణ' అను శబ్దము వ్యవహారములో "నారైన" అని, 'సూర్యనారాయణ'అను శబ్దము "సూన్నారాయణ" అని 'సుబ్రహ్మణ్యము" అను శబ్దము

"సుబ్రహ్మణ్యం" అని ఉచ్చారణలో అక్షరాలు మారు చున్నవి. అందులో కూడ సౌమ్యనా-యు-ణ- మొదలైన అక్షరాలు త్వరగా మారుచుండును. అట్లు మంత్రములలో మారినచో ఫలితము తగ్గించు టగును. అందుకే నారాయణుడు. మొదలైన స్థలాలలో నా, యు మొదలైన అక్షరాదులకు ఉదాత్త, అనుదాత్త, స్వరితాది స్వరాలను తగిలించి సురక్షితం చేసి వేదమును నిలిపినారు. లేనిచో వైదికభాష కూడ మారవలసియే యుండును

ఇంక నీ స్వరములు ఉదాత్త, అనుదాత్త, స్వరిత అను భేదములచే మూడు రకాలు, తాల్వాది స్థానములు సమాసభాగములలో నుండగా నూర్ధ్వభాగమునుండి యుచ్చరింపబడిన అచ్చు నుదాత్త మనియు, అధోభాగమునుండి యుచ్చరింపబడిన అచ్చు అనుదాత్తమనియు, ఉదాత్తానుదాత్త ధర్మములు గల యచ్చును స్వరిత మనియు నిర్ణయించినారు. దీనికే పాణినిముని - "ఉచ్చైరుదాత్తః - నీచైరనుదాత్తః - సమాహారః స్వరితః" అని సూత్రీకరించినాడు. ఈ స్వరముల వలననే గానశాస్త్ర ముత్పన్నమయినదట.

ఉదాత్తమువలన నిషాదగాంధారస్వరములు, అనుదాత్తమువలన ఋషభధైవతస్వరములు, స్వరితము వలన షడ్జ - మధ్యమ - పంచమస్వరములు, అను సప్తస్వరములు పుట్టినవి? చూడుడు.

నెమలి షడ్జస్వరములోను, ఆవులు ఋషభములు మేకలు గాంధారములోను, క్రౌంచపక్షి మధ్యమములోను, వసంతములోని కోకిల పంచమ స్వరములోను, గుఱ్ఱము

దైవతములోను, ఏనుఁగు నిషాదములోను, వసంతకాలమందు కోయిల మొదలైనవి పంచమ స్వరములోను, కూయునట. దీని నమరకోశకారుఁ డిట్లన్నాఁడు.

శ్లో॥ షడ్జం మయూరాః వదతి గావ స్త్వృషభ భాషిణః
అజావికంతు గాంధారం క్రౌంచాః క్వణతిమధ్యమమ్
పుష్పసాధారణేకాలే పికః కూజతి పంచమమ్
ధైవతం హేషతే వాజీ నిషాదం బృంహతే గజః
మయూరాదయః ఏతేహి మత్తా గాయంతి పంచమమ్ –

అర్లే నేక యొక మాత్రాకాలమున (హ్రస్వము), కాకి రెండు మాత్రల కాలమున (దీర్ఘము), నెమలి మూఁడు మాత్రల కాలమున (ప్లుతము), ముంగిస అర్థమాత్ర కాల మున (హాల్ మాత్ర) కూయును. కాని నేటి "సైన్సు" కంఠ ములోని కండరముల కదలికలచే నీ యక్షరము లన్నియు బుట్టుచున్నవని చెప్పుచున్నది. కాని లోపల జరుగు ప్రయ త్నములను బరిశీలించిన యీ శిక్షావిధానము సత్యమని తోఁచును.

ఓయీ ! ఈయక్షరములను మన యిష్టానుసారముగా నుచ్చరించక పోయినచో నష్టమేమని ప్రశ్న –

అనగా అక్షరములను జాగరూకతతో శాస్త్రీయము గానే యుచ్చరించవలయును. మనచేఁ జక్కఁగా నుచ్చరించ బడిన వర్ణములు మార్జారకిశోరన్యాయముగా మనలను రక్షించునట. మన యిష్టానుసారముగా నుచ్చరింపబడినపద ములకు రోగము, రూఢి మొదలగునవి నశించి యపార్థ ముల నిచ్చును. ప్రతిశబ్దము నందు శక్తి కలదని వైయాకరు

ణుల యభిప్రాయము. కాన వారు "శక్త్యంపదమ్" అన్నారు. అక్షరసంపుటియే గాయంత్రీమంత్రముగానైన, గాడిదకొడుక అనుతిట్టగానైన, నగుచున్నది. కాన శాస్త్రీయముగా ప్రత్యక్షరము పలికినగాని సార్థకముగాదు. ఉచ్చారణలో దోష మున్నచో "ఇంద్ర శత్రుర్వర్ధస్వ" అనుచోట వచ్చినట్లు ఉదాత్త అనుదాత్తస్వరములలో మార్పువచ్చును. దానిచేఅర్థ భేదము కలుగును. గాయత్రీ మంత్రజపమువలన ననంతఫలము కలుగు నట్లే ఒకడు నశించవలెనని జపించినను వానికినాశనము సంభవించ వచ్చును. తెలుగులో "గాడ్దెకుట్టు" ఇంగ్లీషులో గాడ్ ది గుడ్ God the Good—అని శుభాంతముగా బరిణమించును, శ్లేషకూడ శబ్దశక్తినే సూచించును. ఒక రేడియో స్టేషన్‌నుండి పోయి ప్రావాహికముగానైన శబ్దము జగమునం దంతట వ్యాపించి "శబ్దగుణక మాకాశం" అను తర్కసిద్ధాంత మున కుదాహరణ మయినది.

అక్షరములలో బ్రహ్మపదార్థబోధక మేది ?

ఇదొక ప్రశ్న. "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" అని 'ఓం' అనేదే బ్రహ్మబోధకముగాన బ్రహ్మస్మరణసూచకముగా మంత్రోచ్చారణకు మొదట చివర ఓంకారము నుచ్చరించుట యాచారమయినది. అకారమునకు బ్రహ్మ, భూమి అను నర్థములు. ఉకారమున "కుండుసది" అని యర్థము. అ+ఉ – గుణసంధిచేసిన ఓ అని యగును. అనగా బ్రహ్మ-భూమియం దుండునదని. సున్న ఎట్లు వచ్చినదనగా – ఈ బ్రహ్మ అనుస్వారముతో గూడి యుండుటచే పూర్ణాంకము వలె నీలోకము బ్రహ్మయందు నిండి యున్నదనియు నర్థ

మూహించవచ్చును. ఈ యోంకారమును యోగు లుచ్చరించి తరింతు మన్నారు. ఇది చాల శక్తిభరితము–

అక్షరములలో దుష్టాక్షరములు గలవా? కలవు – అని వైయాకరణు లంగీకరించినారు. పైగా ఛందస్సులో పాపాక్షరాలు, శుభాక్షరాలు అని విడమర్చి చెప్పుచున్నాడు– చూడుడు. కోపము వచ్చిన కవులు ఆరింట తకారముంచి ప, ఫ మొదలైన పాపాక్షరాలతో శత్రువుపైఁ బద్యమును జెప్పిన పైనారు చచ్చెదరు. కాన వీనిలో సత్త్వ–రజ–స్తమస్, అనే లక్షణా లున్నవని ఉప్పకవ్యాదులు చెప్పినారు. భావకవులు అక్కర లేదు, పదవా లేదన్నారు. వర్ణమునకు రంగు అని కూడ అర్థమున్నది. కాన వీనిలో గూడ నలుపు, తెలుపు, పసుపు, ఎఱుపు రంగుల యక్కరములు కలవట–

మరియు క చ ట త ప లనెడి పంచవర్గములు గలవు. ఈ పంచసంఖ్య బ్రాహ్మణాది పంచజాతుల ననుసరించి వచ్చినవని యూహించినారు. ఆ వ్రేళ్లనుఈజాతులతో బోల్చినారు. యరలవాదులు అష్టవసువుల వలెనే యష్టసంఖ్యతో నొప్పుచున్నవనియు పైవర్ణముల కాధారములనియు, అచ్చులు ప్రాణములు, హల్లులు ప్రాణులనియు వర్ణించిచెప్పినారు. అది పరిశీలించినచో సత్యమని తెలియును.

కాన అక్షరములను జక్కగా నుచ్చరించిన వారికి ఆయుర్వృద్ధియనియు, అర్థము తెలియక యుచ్చరించిన నాయుర్నాశకమనియు–స్వరహీనునకు వ్యాధులు సంభవించుననియు శిక్ష చెప్పుచున్నది. దీని రచయిత పాణినిమహాముని.

– సమ్యగ్వర్ణ ప్రయోగేణ బ్రహ్మలోకే మహీయతే–

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

---

# పాణినీయము

ఓం నమః పాణిని కాత్యాయన పతంజలిభ్య
శ్శబ్ద విద్యాసంప్రదాయ కర్తృభ్యోవంశ
ఋషిభ్యః పరమగురుభ్యో నమోమహద్భ్య గురుభ్యః

అంత గురుశిష్యులు - ప్రవేశించెదరు.

శిష్యు- గురువరా! సంస్కృతమునకువ్యాకరణమున్నదా?

గురు- దేశములోనున్న వ్యాకరణములకంటె పెద్దది విస్తృతము నిర్దుష్టమగు వ్యాకరణము సంస్కృతమునకే గలదు.

శిష్యు- వ్యాకరణ మనగానేమి ?

గురు- విను. వ్యాక్రియన్తే శబ్దాః అని వ్యుత్పత్త్యర్థముచే శబ్దములు దీనిచే వ్యాఖ్యానించబడును. గాన వ్యాకరణమయినది.

శిష్యు- మన సంస్కృతభాషలో వ్యాకరణములెన్ని గలవు? వాని కర్తలెవరు ?

గురు- ఐంద్రః-చాంద్రః-కాశకృత్స్నః ఆపిశలీ శాకటాయనః పాణిని - అమర - జైనేంద్రాః భవన్త్యష్టాది శాబ్దికాః

అని 8 రకాలు వ్యాకరణాలను ఎనమండ్రు వ్రాసినారు.

శిష్యు- ఇన్ని వ్యాకరణముల యావశ్యక మేలకలిగెను ?

గురు- ఒకదానిని సంస్కరించుటకు శిష్టశబ్దసాధుతకు మత భేదముల పరిహారమునకు సిద్ధాంత మతస్థాపనకు 8 వ్యాకరణములు విరచితములు.

శిష్యు- వీనిలో పాణినీయమే మిగుల ప్రసిద్ధిలోనికి వచ్చుటకు మిగిలిన వంతరించుటకుం గారణము చెప్పంగలరా ?

గురు- నాయనా! ఈవిషయమును నొకకథ పరంపరాప్రాప్త మైయున్న గలదు. అదేమన విశ్వామిత్రుడు డందఱివ్యాకర్తలదగ్గఱకు వచ్చి నాపేరు నెట్లుసాధించినావని యడుగగా పాణినితప్పనందరు విశ్వస్య-అమిత్రః-లోకమునకు శత్రువని సవర్ణదీర్ఘసంధిచేసాధించినారట. ఒక పాణినిమాత్రము విశ్వస్య మిత్రః అనిచెప్పి యిట దీర్ఘమువచ్చుటకు మిత్రే చర్షౌ-ఋషివాచక మిత్రశబ్దే పరతః విశ్వ శబ్దస్య దీర్ఘస్స్యాత్-విశ్వామిత్రః అని లోకమునకు మిత్రమని ప్రత్యేక సూత్రకల్పనముచేసి సాధించగా సంతోషించిన కౌశికుఁడు నీ వ్యాకరణమే లోకములో నిలుచునని యితరుల వ్యాకృతు లంతరెంచుననియు శపించుటచే నీపాణినీయమే నేటికి నిలిచిన దందురు.

శిష్యు- దీనికిఁ గర్త లెవరు ?

గురు- పాణిని, కాత్యాయనుఁడు పతంజలి యనుమునులు.

శిష్యు- వారి చరిత్రము గలదా ?

గురు- పాణిని శాలాతుర గ్రామనివాసి. ఇతనితల్లి దాక్షి. తండ్రి శలంకుఁడు- పాణిని గోత్రుఁడు ఆహికుఁడనియుఁ గొందఱందురు. ఇతఁడు 3982 సూత్రములను వ్రాసినాఁడు,వీటినే 8 అధ్యాయములలో 32 పాదములలో నిమిడ్చి యష్టాధ్యాయి యనినాఁడు. మరియు 1968 ధాతుపాఠములను 192 లింగానుశాసనములను 221గణపాఠములను శిక్షాక్రమములోనుపదేశించినాఁడు. పైగాఁ దనసూత్రములలో సుమారు 14 మంది వ్యాకరణశాస్త్ర రచయితల నామధేయములను స్మరించినాఁడు.

1 ఆదాచార్యాణాం 2 వాసుప్యాపిశలేః 3 ఉదీచామిఞ్. యజుష్యేకేషాం-తృషిమృషికృషేఃకాశ్యపస్య-ఓతోగార్గ్యస్య-

లోపశ్శాకల్యస్య - తృతీయాదిషుభాషిత పుంస్కం పుంవద్గాలవస్య - ఈ చాక్రవర్మణస్య- ప్రాచాంష్ఫత్ఢతః- ఋతో భారద్వాజస్య- లఙః శాకటాయనస్యైవ- అవఙ్ స్ఫోటాయనస్య.

ఇట్లే తన పూర్వవ్యాకర్తలను సూత్రములలో సక్క-డక్కడ స్మరించినాడు. ఈతని వ్యాకరణముచే వెనుకటి వ్యాకరణము లంతరించియుండవచ్చును. ఆ వ్యాకరణములు ఇంత సమగ్రముగా భాషను సంస్కరింప లేక యుండవచ్చును.

ఈ భాషారూపములన్నియు ధాతుజన్యములని "సర్వే శబ్దాః ధాతూత్పన్నాః" అన్నాడు. కొన్నియపభ్రంశరూపములు వ్యవహారములోనుండగా వానిని — "ఉణాదయోఽవ్యుత్పన్నాని ప్రాతిపదికాని- ఉణాదయో వ్యుత్పన్నాని ప్రాతిపదికాని, అని రెండురకములుగా విమర్శించి గతికల్పించినాడు. వీనికై కొన్ని పరిభాషలను సృజించి వ్యాకృతిని నిలిపినాడు.

శిష్యు- ఈతని వ్యాకరణమే వేదాంగ మెట్లయ్యెను?

గురు- వాగ్వై పరాచీ అవ్యాకృతా అవదత్. తేదేవా ఇంద్ర మబ్రువన్. ఇమాంనో వాచంవ్యాకురు ఇతి. సః అబ్రవీత్, వరం వృణై మహ్యాంతపవవష వాయు శ్చైచ సహగృహ్యాతామితి. తా మింద్రో మధ్యతః అవక్రమ్య వ్యాకరోత్. తస్మాదిదం వ్యాకృత వాగుదీర్యతే- తైసం- 6-4-7 ఈ మంత్రముచేతను-

అథశిక్షాం వ్యాఖ్యాస్యామః వర్ణస్స్వరః మా

త్రాబలం- సామసంతానః (తై ఉ 1-1-1)

పైవానివలన భారతదేశమున వ్యాకరణముకూడ అనాది యనియే చెప్పవలెను. కాని కాలపరిమితి చెప్పరాదు. అందును పాణినీయము వైదికప్రక్రియచే వైదికశబ్దములను మిగిలినభాగ

ములచే లౌకికశబ్దములను సాధించుటచే నిది వేదాంగతను సంపాదించినది. మిగిలినవానిలో స్వరవైదిక ప్రక్రియలు లేవనియు చెప్పవలెను.

శిష్యు- ఆచార్యా! సూత్రమనగా నేమి?

గురు- శ్లో. అల్పాక్షరమసందిగ్ధం సారవద్విశ్వతోముఖమ్
అస్తోభమనవద్యంచ సూత్రం సూత్రవిదోవిదుః

శిష్యు- శాస్త్రమనగా నేమి?

గురు- శ్లో. ప్రవృత్తిర్వా నివృత్తిర్వా నిత్యేనకృతకేనవా
పుంసాం యేనోపదిశ్యేత తచ్ఛాస్త్ర మితికథ్యతే.

శిష్యు- వరరుచి యెట్టివాఁడు? ఆయన ఘనతయేమి?

గురు- పాణినిసూత్రములు పర్యాప్తములు కాకపోగా వరరుచియను ముని వార్తికములను వ్రాసెనాఁడు. ఈతనినే కాత్యాయనుఁ డందురు. ఈ వార్తికసంఖ్య 4 వేలు మాత్రమే!

శిష్యు- వార్తికమనగా?

గురు- శ్లో. ఉక్తానుక్తదురుక్తానాం చింతాయత్ర ప్రవర్తతే
తంగ్రంథం వార్తికం ప్రాహుః

ఈతఁడు తన వార్తికములలో వ్యాడి - పౌష్కరసాదులను పేర్కొనెను. వ్యాడికూడఁ బాణిని సూత్రములకు "సంగ్రహ" మను విపులవ్యాఖ్య రచించెనట. ఈ విషయము నీ భాష్యము బోధించుచున్నది. భా- కింపునర్నిత్యశ్శబ్దః? అహోస్విత్కార్యః? సంగ్రహే ఏతత్ప్రాధాన్యేన పరీక్షితమ్- నిత్యోవాస్యాత్ కార్యోవేతి "ఆనివ్యాఖ్యానములో" సంగ్రహః లక్షశ్లోక పరిమితగ్రంధః అని కైయటనాగోజీల సాక్ష్యముల ననుసరించి తెలియుచున్నది.

కాని యీ గ్రంథము భర్తృహరి నాటికే లుప్తమై యుండవలెను. ఈ కాత్యాయనుఁడు దాక్షిణాత్యుఁడని భాష్యములో "ప్రియతద్ధితా దాక్షిణాత్యాః" అని పతంజలి యాక్షేపించును.

శిష్యు- భాష్యమనగా నేమి?

గురు- శ్లో. సూత్రార్థో వర్ణ్యతేయత్ర వాక్యైస్సూత్రాను కారిభిః

స్వపదానిచ వర్ణ్యన్తే భాష్యం భాష్యవిదోవిదుః

శిష్యు- మహాభాష్య రచయితయెవరు? అతని చరితమేమి?

గురు- పతంజలి మహాభాష్యమును వ్రాసెను. అనగా నిది పాణినీయమైన అష్టాధ్యాయికి వ్యాఖ్యానము. ఈపతంజలి యాదిశేషుని యవతారావతారమని ప్రాచీనులసంభావన. ఇతనికి బాహువులవఱకుఁ బురుషాకృతి, చేతులలో శంఖచక్రగదాపద్మములు. వెయ్యి తలలపాముట! తెలుపట!

శ్లో. ఆబాహుపురుషాకారం శంఖచక్రగదాధరమ్
సహస్రశిరసం శ్వేతం పతంజలి ముపాస్మహే-

అని పొగడినారు. ఈతఁడు యోగశాస్త్రమును వ్రాసి చిత్తమాలిన్యమును వ్యాకరణమహాభాష్యముచే వాఙ్మలమును వైద్యగ్రంథముచే (చరకము) శారీరిక మలమును బోగొట్టెనని యీ క్రింది శ్లోకము సాక్ష్యము నిచ్చుచున్నది.

శ్లో. యోగేనచిత్తస్య పదేనవాచాం
మలం శరీరస్యచ వైద్యకేన
యోఽపాకరోత్తం ప్రవరం మునీనాం
పతంజలిం ప్రాంజలిరానతోఽస్మి

గోణికయను బ్రహ్మచారిణి తపస్సుచేయుచుం బ్రదోషకాలమున సూర్యార్ఘ్య ప్రదానకాలమున జలాంజలి యీయగా నందునుండియొక సర్పము పడెనట! దానినింజూచిగోణిక భయపడి "కోర్బవాన్" అని రేఫసహితముగా దుష్టముగా నన్నదట! అపాము "సపోఽహం" నేనుపాముననని రేఫలేకుండగాదుష్టముగానే జవాబిచ్చినదట! ఆమె "రేఫస్యకథంవాలోపః"సర్పోఽహమని రేఫలేకుండనేలపలుక వలయునుగగా త్వయైవాఽపహృతః నీచే నా రేఫ దొంగిలింపబడినదన్నదట! ఆంటనేయాపాము పైన చెప్పిన పతంజలి యాకారమైన అమ్మా! తపస్సునకు బోవుచున్నాను— అవసరము వచ్చినప్పుడు స్మరింపు మన్నాడట! ఈతఁడే పతంజలి—గోకర్ణ క్షేత్రములో వ్యాకరణశాస్త్ర రచనకై శివునిగూర్చి పాణిని—కాత్యాయనుఁడు పతంజలి మువ్వురును కలిసి తపస్సు చేయుచుండగాఁ గొంతకాల మునకు వీరియం దనుగ్రహముగల శంకరుఁడు అలవాటుగా నొకసాయంతనన్ఱత్తావసరమున 14 మారులు తన ఢక్కాను ప్రయోగించెను. ఆ ఢక్కాధ్వని సభలోనున్నవారికేగాక యీ ముగ్గురకుం గూడ గోచరము కాలేదు. మువ్వురను శివుని ప్రార్థించిమాకా ధ్వను లర్థముకా లేదనగా దయాళువైన యాపరమశివుఁడు నంది కేశ్వరున కాజ్ఞయీయఁగా నాతఁడు 14ఢక్కాధ్వనులనుగూడ

శ్లో. నృత్తావసానే నటరాజరాజో ననాదఢక్కాం నవపంచవారం
ఉద్ధర్తుకామస్సనకాది సిద్ధా నేతద్విమర్శే శివసూత్రజాలం

అఇఉణ్ — ఋఌక్ — ఏఓఙ్ — ఐఔచ్ — హయవరట్— లణ్—ఞమఙణనమ్—ఝభఞ్—ఘఢధష్—జబగడదశ్ — ఖఫఛఠథ చటతవ్—కపయ్—శషసర్—హల్—ఇతిమాహేశ్వరాణిసూత్రాణి

అని భట్టోజీ దీక్షితులు తన సిద్ధాంత కౌముదిలో సాక్ష్యమిచ్చుచుండగా నేటి చారిత్రికులు తాముచూచినట్లు పుక్కిటిపురాణములుగా లాగివేయుట చాలా చిత్రముగదా! తరువాత ఈ సూత్రముల నీ క్రమములోనే యుంచి పతంజలి భాష్యమును వ్రాసినాఁడు. వీని మొదటి చివరలైన యక్షరములను సంజ్ఞలు (ప్రత్యాహారములుగా) గా గ్రహించి పాణినిసూత్రరచన సాగించెను. పతంజలి, పాణిని సూత్రము లెంతమహత్తరములో! తన మహాభాష్యములోఁ జెప్పుచున్నాఁడు. వృద్ధిరాదైచ్-సూత్రభాష్యమున-ప్రమాణభూత ఆచార్యో దర్భపవిత్రపాణిః శుచావవకాశే, ప్రాఙ్ముఖ ఉపవిశ్య మహతా ప్రయత్నేన సూత్రాణి ప్రణయతిస్మ. తత్రాఽశక్యం వర్ణేనాప్యనర్థకేన భవితుమ్ “కైగా”ఽర్ధమాత్రాలాఘవేన పుత్రోత్సవం మన్యన్తే వైయాకరణాః॥ అంటాఁడు.

పరమప్రమాణుఁడైన పాణిని దర్భపవిత్రపాణియై శుచిప్రదేశమున దూర్పుముఖముగాఁ గూర్చొని మహాప్రయత్నముతో సూత్రములను వ్రాసెను. గాన ఒకయక్షరమైన వ్యర్థమైన దుండదనియు-వైయాకరణు లర్ధమాత్రమక్షరముతగ్గినను పుత్రోత్సవముగా భావించెదరని మహాభాష్యము తెల్పుచున్నది.

పాణినియందింతగా గౌరవముగల పతంజలియైనను నొకానొకచోట పాణినిమతము నుల్లంఘించి “అస్మాకమిష్టిః” మాకిదే యిష్టమని చెప్పుటయు గలదు.

ఏశాస్త్రములోనైన లేని స్వాతంత్ర్యమును భాష్యకారుఁడిక్కడఁ జూపుచున్నాఁడు గావుననే దీనికి మహాభాష్యమని

పేరు సార్థకముగదా! ఇతర భాష్యకారులందఱు సూత్రకారుల ఛాయలలోనే పోయిరిగాని యిట్లు స్వతంత్రించినవారు సున్న. ఇందులో శైలి-అర్థగాంభీర్యములుగలవు. వీని ననుసరించి పెద్ద లిట్లనిరి.

మహాభాష్యంవా పాఠయేత్-మహారాజ్యంవా పాలయేత్

మహాభాష్యమునైన జదువవలెను- మహారాజ్యము నైన బాలించవలయును అని-

మరియు ఈ శాస్త్రము పాణినీయముగాఁ బరగుచున్నను మహాభాష్య సిద్ధాంతములకే ప్రామాణ్యము- ప్రచారములు గలుగుచున్న వేమియనగా-

యథోత్తరం మునీనాం ప్రామాణ్యమ్-

అని సమాధానము చెప్పినారు.

మరియు భాష్యములో గోనర్దదేశీయస్త్వాహ – గోణికా పుత్రస్త్వాహ॥ అని పలుమారు లుచ్చరించుటచే నీ పతంజలి గోనర్దదేశములో గోణికకుఁ బుట్టినాఁడని తెలియుచున్నది.

శిష్యు= ఈ భాష్యరచన యెక్కడ జరిగెను?

గురు= ఇది చిదంబర క్షేత్రమున జరిగెను. పరమేశ్వరుఁడు మహేశ్వరసూత్రముల నిచ్చటనే ప్రసాదించినాఁడని కొందరి వాదన. ఈచిదంబరములో సమాధిలో పతంజలి యీనాటికిని జీవించి యున్నాడని గొందఱందురు, కాని యాతనికిక్కడనే తప్ప నితరత్ర దేవాలయములు గానరావు. మరియు నీనాడు బీహారురాష్ట్రములోఁ బాటలీపుత్రమను (PATNA) చోటనీ శాస్త్ర ముత్పన్నమయిననని కొందరి వాదన-

కుండ్యాద్యాచార్యుల వృత్తులలోని దోషనిరాసకై భగవంతుఁడైన పతంజలి మహాభాష్యమును వ్రాసినాఁడని యీ భాష్యపంక్తి చెప్పుచున్నది.

వ్య కుండ్యాదిభిరాచార్యైః రచితాసు వృత్తిష్వ
క్వచిన్న్యూనతామవలోక్య గోనర్ద దేశే
భగవాన్పతంజలి గోత్రజన్మా శేషావతార
త్వేనవిఖ్యాతః కశ్చిన్మహాప్రతిభా ప్రభావో
మునిప్రవరో మహాభాష్యం నిగమాత్—

శిష్యు— భాష్యమునంతనుఁ బతంజలియే వ్రాసినాఁడా ?

గురు— ఆశేషుని యవతారమైనయీపంతజలి ప్రతిదినము తాను తెరలోనుండి బైట శిష్యులనుంచి సహస్రముఖముల సహస్రశిష్యగణములకు మహాభాష్యపాఠమునుజెప్పుటపరిపాటి. ఒకనాడు వేదవ్రతుఁడను ఛాత్రుఁడు శారీరక బాధానిరాసమునకై శాస్త్రపాఠమును జెప్పక నియమోల్లంఘనముగావించి బైటికిఁ బోయెను. ఈలోగా మరియొకఁడు వేయివాక్కులుగా వచ్చుచున్న యొజ్జపలుకులఁ దిలకించి యచ్చెరువంది యుత్తరయనించి తెరతొలగించి పరికించెను. అప్పుడీవలనున్న ఛాత్రమండలి సకలము ఆవిషజ్వాలలకు ఆవిరిగానై బసుమముగానైనది— అది తిలకించిన యీగురుతిలకము మునిరూపునంది "అయ్యో! ఒకని యవివేక మెందరి నాశనమునకు దారియయ్యెనని యెడదలో బెడదనంది యీభాష్యము నెట్లుముగింతునా ? యనుకొను చుండగా బాహ్యప్రవృత్తి కతిగిన వాఁడకు దెంచి యీ సంఘమరణమునుగాంచి దుఃఖించుచుండగా "వానిని జూచి భాష్య శాంతి చేయకుండగా పాఠమధ్యములో బైటకు బోయితివి గాన

పిశాచమువై కమ్మని పెద్దయొజ్జ శపించెను. ఆ వేదవ్రతుఁడు కూడ గురుపాదములపైఁబడి ప్రార్థించగా మిఁగిలిన పాపములను నీకు నేను తొలఁగించెదను. ఒకరి కీశాస్త్రమును సాంతముగా జెప్పినచో నీకీపిశాచ జన్మ నశించుననగా, నతఁడా వ్రాసిన యాకులఁగొనియొక విద్యార్థికి (మల్లినాథునకు) వ్యాకరణమును గురుదయచేఁ బూర్తిచేసి శాపము నాపోశన పట్టెనందురు. మరికొందరు ఈ పిశాచము ఒక యడవిలో నొక చెట్టుపై గూర్చొని పచధాతోః నిష్ఠాయాం కింరూపమ్-అని ప్రశ్నించగా పచితమ్ అని కొందరు- పాచితం పక్తం అని- అపభ్రంశముగా జవాబిచ్చువారిని జంపి తినుచుండగా ఒక బుద్ధిమంతుఁడా దారిని బోవుచు "పక్వమ్" అనగా ఆతని బ్రతిమాలి గొని పోవుచు వాని కీభాష్యమంతయు బూర్తిచేసెను. అతఁడా భాష్యమును మఱ్ఱియాకులపై వ్రాసికొని మోపులను గట్టుకొని పోవుచు సూర్యాస్తమయమగుటచే నా మోపు నక్కడనుంచి ఆతఁడర్ఘ్యమిచ్చుటకు నదికి బోయెను. ఈలోఁగా నొక మేకవచ్చి కొన్ని మఱ్ఱియాకులను భక్షించెను. ఆ యజభక్షిత మిప్పటి కని కండలీకరణములను పేరిట బూర్తిచేయఁబడినవి గాననగును

శిష్యు= గురుదేవా! ఈ వ్యాకరణము వేదాంగముగా నెట్లయినది? అది లేనిచో వేదమున కెట్టిలోటు?

గురు= నాయనా! విను. పాణినిసూత్రములకు వరరుచి వార్త్తికములకును సరియైన వ్యాఖ్యానగ్రంథ మీభాష్యమే! ఈ సూత్ర వార్త్తికముల లోపములను సరిచేసి మాఱ్పులను గూడ జేసియుభాష్యము పుట్టెను. సూత్రవార్త్తికకారుల నాక్షేపించుచు జీవాటులఁ బెట్టుచు యుక్తిప్రత్యుక్తులతోఁ గూడినదే యీ

భాష్యము. దీనిలో మొదటిపాతమునకుఁబన్పశాహ్నికమందురు. దీన్నొక దినములోఁ బతంజలి చెప్పెనట! సంస్కృత వచనరచన కిద్దే పరాకాష్ఠ! ఇంత చక్కని వచనరచన యేభాషలో నేకాల మున లేదని చెప్పవచ్చును. దీనివలన ఆనాటికిశ్లోకరచన ప్రవృద్ధముగా లేదని యూహింపనగును. దీని కీయాక్షేపణయే ఉపష్టంభకము.

భాష్యం- అపిచభోః శ్లోకాఅపి ప్రమాణం ? తద
పాశ్లోకః ప్రమాణం భవితుమర్హతి.

ఓయీ! శ్లోకములుకూడఁ బమాణములైనచో నీశ్లోక ముకూడఁ ప్రబమాణమగును.

శ్లో. యదుదుంబర పర్ణానాం ఘటీనాం మండలం మహత్ —
పీతం న గమయేత్స్వర్గం కిం తత్క్రతుగతం నయేత్.

ఓయీ! యజ్ఞాలలోఁ గొంచము కల్లుత్రాగినచో స్వర్గము వచ్చినయెడల ప్రతిదినము మేడియాకులతో గప్పబడిన కుండల కొలది కల్లుఁ ద్రావబడుచు నెంతస్వర్గము నీయవలయును ? ఇందుచే శ్లోకరచనకుఁ బ్రామాణ్యాభావము సిద్ధించుచున్నది. ఆనాటికి వచనకవితయే ప్రమాణముగాని శ్లోకకవితకాదని తెలియుచున్నది.

—♦ ఇంక వేదాంగత ♦—

నాయనా! మహాభాష్యములో

అథశబ్దానుశాసనమ్ కేషాం శబ్దానామ్? లౌకికానాం వైదికానామ్చ- అని

లౌకికవైదిక శబ్దముల యనుశాసనమే ప్రయోజనములు: అని మరియు-

రక్షోహాగమ లఘ్వసందేహాః ప్రయోజనమ్-
రక్షార్థం వేదానామధ్యేయం వ్యాకరణమ్- లోపాగమ
వర్ణవికారజ్ఞోహి సమ్యగ్వేదా న్పరిపాలయిష్యతీతి-
వైయాకరణి లోప- ఆగమ. వర్ణవికారాదులు దెలిసి
బాగుగా వేదములను రక్షించగలఁడట !

2, ఊహాః ఖల్వపి-నసర్వైర్లింగైః నచ సర్వాభిర్విభక్తిభి
ర్వేదేమంత్రా నిగదితాః- తేచావశ్యం యజ్ఞగతేన
పురుషేణ యథాయథం విపరిణమయితవ్యాః- తాంనా
వైయాకరణః శక్నోతి యథాయథం విపరిణమయితుమ్
తస్మాదధ్యేయం వ్యాకరణం-

యజ్ఞాదులలో మంత్రములలోని లింగవచనవిభక్తులను సందర్భానుసారముగా మార్చి చెప్పవలెను: అది వైయాకరణికే గాని యితరులకు సాధ్యముగాదు గాన వ్యాకృతిని జదువవలెను.

3. ఆగమః ఖల్వపి- బ్రాహ్మణేన నిష్కారణో ధర్మః
షడఙ్గో వేదోఽధ్యేయో జ్ఞేయశ్చ. షట్స్వంగేషు
ప్రధానం వ్యాకరణమ్. ప్రధానే చకృతో యత్నః ఫల
వాన్భవతి- తస్మాదధ్యేయం వ్యాకరణమ్-

బ్రాహ్మణునకు షడంగములతోఁ గూడిన వేదాధ్యయనము నిష్కారణ ధర్మము. షడంగములలో వ్యాకరణమే ప్రధానము. ప్రధానమున ప్రయత్నించినచో యత్నము సఫలముగదా!

4. లఘ్వర్థం చాధ్యేయం వ్యాకరణమ్- బ్రాహ్మణే
నావశ్యం శబ్దా జ్ఞేయాః- నచాంతరేణ వ్యాకరణం
లఘునోపాయేన శబ్దాశ్శక్యా జ్ఞాతుమ్- తస్మాద
ధ్యేయం వ్యాకరణమ్-

తప్పక బ్రాహ్మణుఁడు శబ్దములను తెలియవలెను. వ్యాకరణము చదువకుండగా లఘూపాయముచే శబ్దములను దెలియరాదు. కాన వ్యాకరణము చదువవలెను,

5. అసందేహార్థం చాధ్యేయం వ్యాకరణమ్—
యాజ్ఞికాః పఠన్తి— స్థూలపృషతీ మాగ్నివారుణీ మనడ్వాహీ మాలభేతేతి· తస్యాం సందేహః— స్థూలా చాసౌపృషతీ చ స్థూలపృషతీతి— స్థూలాని పృషన్తి యస్యాః సేఽయం స్థూలపృషతీతి— తాం నావైయాకరణః స్వరతోఽధ్యవస్యతి— యది పూర్వపద ప్రకృతి స్వరత్వం తతో బహువ్రీహిః— అథసమాసాంతోదాత్తత్వం తతస్తత్పురుష ఇతి— తస్మాద ధ్యేయం వ్యాకరణమ్—

యజ్ఞములోనవలంభనము చేయు స్థూలపృషతి (గోవైన్గ తో౯క) గల యెద్దును దెమ్మన్నారు— స్థూలపృషతి యనునో పూర్వపదప్రకతి స్వరముచేసి బహువ్రీహి చెప్పవలెనా? లేక సమాసాంతోదాత్తముచేసి తత్పురుష చెప్పవలెనా? అనిసందేహము గలుగుచున్నది. దీనిని వైయాకరణికాని స్వరమువలన తీర్పజాలఁడు— కాన వ్యాకరణమున్ను జదువవలెను—

మరియును గొన్ని అవాంతర ప్రయోజనములను జెప్పుచున్నాడు—

1. అవిద్వాంసః ప్రత్యభివాదే నామ్నో యే న ప్లుతిం విదుః—
కామం తేషు చ విప్రోష్య స్త్రీష్వివాయ మహం వదేత్—
అభివాదే స్త్రీ వన్మాభూమేత్యధ్యేయం వ్యాకరణమ్—

మనల నమస్కరించినవారి నాశీర్వదించుట ప్రత్యభివాదన మందురు. వైయాకరణి ప్రత్యభివాదనములో వాని పేరు చివర ప్లుతముతో నుచ్చరించినచో వాఁడు దీర్ఘాయుష్మంతుఁడగును– ఈ సంగతి వైయాకరణికిఁ దక్కఁ దక్కినవారికి దెలియదు–ఆడువారికి ప్లుతము తెలియదు– నన్ను మాత్రము స్త్రీనిగా జేయకుమనుచున్నాఁడు– కాన వ్యాకరణమును జదువవలెను. ఈప్లుతమును నుచ్చరించిన దీర్ఘాయుర్దాయము గలుగును.

2. దశమ్యాం పుత్రస్య–
యాజ్ఞికాః పఠన్తి– దశమ్యుత్తరకాలం పుత్రస్య
జాతస్య నామవిదధ్యాత్–ఘోషవదాద్యంతరస్థ
మవృద్ధం త్రిపురుషానూక మనరిప్రతిష్ఠితం
తద్ధి ప్రతిష్ఠితతమంభవతి– ద్వ్యక్షరం
చతురక్షరం వా నామ కృతం కుర్యాన్న తద్ధితమ్
నచాన్తరేణ వ్యాకరణం కృతస్తద్ధితా వా శక్యా
విజ్ఞాతుమ్

యాజ్ఞికులు పఠించుచున్నారు– పిల్లలకు బారసాలనాడు పేరుపెట్టవలెను– పేరునకుఁ జివర మొదట ఘోషప్రయత్నము గలదియు– వృద్ధప్రాతిపదిక కానిదియు తన తండ్రి తాతముత్తాతలలో నెవ్వరికైన గలదియగు శత్రువులకు లేనిదియగు పేరు పెట్టవలెను– అదా బాలుని ప్రతిష్ఠావంతునిగాఁ జేయును– అది 2–4–6 మున్నగు సరియక్షరములు గలదిగా నుండవలెను–తద్ధితాంతప్రత్యయము కూడదు– ఇందు ఘోషములు. తద్ధితములు– మున్నగునవి తెలియుటకు వ్యాకరణజ్ఞాన మావశ్యకముగదా!
ఇందులోనే–

యథా కుంభ కారకులం గత్వాఽఽహ-కురు
ఘటాన్ కార్యమనేన కరిష్యామీతి. తద్వైవద్వై యా
కరణ కులంగత్వాఽఽహ. కురుశబ్దాన్ ప్రయోక్ష్యే ఇతి-

కుమ్మరివానియింటికిబోయి పనియున్నదిగాన
కుండలు తయారుచేసి యిమ్మన్నట్లుగా వైయాకరణి యింటికి
బోయి శబ్దములను దయారుచేయుము. ప్రయోగించుకొనవలె
నని చెప్పవలెను— కాన వ్యాకరణావశ్యకత మిస్ఫుటము. ఇట్లు
వేదాంగములలో ముఖ్యముగాన.

ముఖం వ్యాకరణం ప్రోక్తం-అన్నారు. మరియు-
భాష్యం=యస్తుప్రయుజ్క్తే కుశలో విశేషే శబ్దాన్యథా
వద్వ్యవహారకాలే-సోఽనన్త మాప్నోతి జయం
పరత్ర వాగ్యోగవిద్దుష్యతిచాఽపశబ్దైః

కుశలుఁడు వ్యవహారకాలమున యథాయోగ్యముగా
శబ్దములను బ్రయోగించినచో వాఁ డిహపరములయం దనన్త
జయ మందగలఁడు-

కాని సుశబ్దాపశబ్దములను దెలియవలెను. అది వైయాకర
ణికేఁగాని సాధ్యపడదు-శబ్దజ్ఞానమువలననే ధర్మమున్నదన్నారు.

పోని యామంచిశబ్దములన్నియు దండగాఁగుచ్చి అమర
శ్లోకములవలెనే సంతలను జెప్పకూడదా ? అని ప్రశ్నించుకొని
యిట్లనుచున్నాఁడు-

భాష్యం-అనభ్యుపాయ ఏషశబ్దానాం ప్రతి
పత్తౌ ప్రతిపద పాఠః- ఏవంహి శ్రూయతే-
బృహస్పతి రింద్రాయ దివ్యం వర్షసహస్రం ప్రతి
పదోక్తానాం శబ్దానాం- శబ్దపారాయణం ప్రోవాచ

చ-నచాంతం జగామ- బృహస్పతిశ్చ ప్రవక్తా-
ఇంద్రశ్చాధ్యేతా- దివ్యం వర్షసహస్రమధ్యయనకాలః-
నచాంతం జగామ-కింపునరద్యత్వే- యస్సర్వథా
చిరంజీవతి వర్షశతంజీవతి- చతుర్భిశ్చ
ప్రకారైర్విద్యా ఉపయుక్తా భవతి- ఆగమ
కాలేన స్వాధ్యాయకాలేన ప్రవచనకాలేన-
వ్యవహారకాలేనేతి-తత్రచాఽస్యాగమ కాలేనైవాఽయుః
కృత్స్నం- పర్యుపయుక్తం స్యాత్-
తస్మాదనభ్యుపాయ శ్శబ్దానాం ప్రతిపత్తౌ ప్రతిపాదపాఠః-

బృహస్పతి యింద్రునకు శబ్దమాలను దేవమానప్రకారముగా వేయి సంవత్సరములు జెప్పినాడు. పూర్తికాలేదు. ఈనాడందఱు సామాన్యముగా నూతేండ్లాయుర్దాయముగల వారు. ఎట్లు సాధ్యము? విద్య. ఆగమ. స్వాధ్యాయ, ప్రవచన-వ్యవహార కాలములచే 4 రకములుగా నున్నది అందులో ఆగమకాలమున కేనూతేండ్లుసరిపడదుకదా! కాన నినదనభ్యుపాయమన్నారు మరియు, వైయాకరణులకు శబ్దమే బ్రహ్మ. పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరి, అను 4 రకముల శబ్దములుగలవు. వానిలో యోగిజనగోచరయగు నాకాశస్థావరమైనపరావాక్కు- బ్రహ్మస్వరూపమనియు అది యస్మదాదుల శ్రోత్రేంద్రియ జ్ఞానాగోచరయనియు నీవాక్కే- నిత్యమనియు వైయాకరణుల మతము.

శబ్దము ద్విక్షణావస్థాయి కాన శబ్దమనిత్యమని నైయాయికుల మతము. పై వైయాకరణమతప్రకారము శబ్దము ఆకాశమునకు బోయి కొన్ని కోట్ల శబ్దములను వెంటనే సృజి

యించియంత్రముల (రేడియోల) ద్వారా నేడు మనచే వినబడు చున్నదిగదా!

శబ్దగుణక మాకాశమను తార్కికవాదమున కిదియే మూలముగదా! కాన నిదివేదాంగమైనది. వైయాకరణులు శబ్దబ్రహ్మలుగాన "విద్యాతపోదానం తపః" అనుశ్రుతిచే విద్య కూడ తపస్సులోనికే చేరునుగాన నీ వ్యాకరణాధ్యయనముకూడ ముక్తికిఁ గారణమగును. వేదము లనంతములని పతంజలియే యనుచున్నాడు.

మహాన్ శబ్దస్యప్రయోగ విషయః.

దాతిర్లవనార్థే ప్రాచ్యేషు, దాత్రముదీచ్యేషు

ఈ సప్తద్వీపవిశాలమైన భూమిలో శబ్దప్రయోగ విష యము చాలగొప్పది. మూడులోకములు- 4 వేదములు అవ్వి సరహస్యములు సాంగములుకూడ-అవ్వి భిన్నములుగానున్నవి. అథర్వణ వేదము 101 శాఖలు- సామవేదము వేయి శాఖలు- తొమ్మిది శాఖలు ఋగ్వేదము. యజుర్వేదము 21 శాఖలు.

వాకము- వాక్యము- ఇతిహాసము- పురాణములు- వైద్యము మున్నగు నింత శబ్దప్రపంచమును గుర్తించక అప్ర యుక్తములు గలవనుట సాహసమేః కాంభోజదేశములలో నే శవతియనగా నడచుటయని యందురు. ఆర్యులు (భారతీయులు) ప్రాణవికారమునందిన వారిని శవమందురు- సురాష్ట్రదేశములో హమ్మతి అనియు, ప్రాచ్యభరత దేశమున రంహాతి యనియు నందురు. ప్రాగ్దేశీయులు లవనార్థమున దాతిః అందురు- ఔత్తరాహికులు దాసినే దాత్రమందురు.

శిష్యు= అయ్యా! బ్రహ్మనుగూర్చి వేదాంతులకు వైయా కరణులకు గల భేదమేమి?

గురు= వేదాంతులు బ్రహ్మయనుపదార్థము వేరుగానున్న దందురు- వైయాకరణులకు శబ్దమే బ్రహ్మ, అందుకే "ఏకశబ్దః సమ్యజ్ఞాతః స్వర్గేలోకే కామధుగ్భవతి" అని వీరిసిద్ధాంతము-

శిష్యు= అయ్యా! పతంజలి యేకాలమువాడు? వీరి మతానుయాయులు గలరా? వీరి గ్రంథములేవి?

గురు= వీరికాలనిర్ణయము చేయుట సుకరముగాదు. భాష్య ములో చంద్రగుప్తసభా- పుష్యమిత్రసభా- అని యుండుటచే పుష్యమిత్ర, అగ్నిమిత్ర- చంద్రగుప్తుల కాలములోనే యీ భాష్యము నిర్మింపబడి యుండవలెను. అనగాకలియుగము 24 వ శతాబ్దిలో జరుగవలెను.

ఈ భాష్యసిద్ధాంతముల ననుసరించి కైయటుఁడుభట్టోజీ దీక్షితులు, నాగేశభట్టు, మున్నగు మహనీయులు- పరిభా షేందు శేఖరము- మనోరమాశబ్దరత్నములు సిద్ధాంతకౌముది- శబ్దేందుశేఖరము మున్నగు వ్యాఖ్యాన గ్రంథములను వ్రాసి నారు. అవ్వి చదువనిదే భాష్యసిద్ధాంతములు తెలియవుగదా! నాయనా! అయినను "ఏకశబ్దః సమ్యగ్జ్ఞాతః స్వర్గేలోకేకామ ధుగ్భవతి-అని వీరి నమ్మకము- యథేంద్ర శత్రుస్స్వరతో౽ పరాధాత్-

ఓం తత్సత్ -

పాశ్చాత్యపండితుఁడు ఎగ్లింగుడు (Iglingudu) దేవభీరుః – దేవతలలో పిరికివాఁడని వ్రాసినాఁడు.

2. హృషీకేశః – జితేంద్రియుఁడని యాస్కుఁడు. నిగనిగ వెంట్రుకలుగలవాఁడని పాశ్చాత్యులవాదన.

3. సహస్రశీర్షా – విరాట్పురుషుఁడని (పురుషసూక్తములో) యాస్కుఁడు –

వేయి తలల రాక్షసి యని పాశ్చాత్యబుద్ధిమంతులు.

4. గుడాకేశః – నిద్రజయించినవాఁడని యాస్కుఁడు.

వాలుఁడు జుట్టుగలవాఁడని పాశ్చాత్యులు.

5. బ్రహ్మవిహారః – పరమశాంత్యవస్థయే బ్రహ్మవిహారమని యాస్కుఁడనగా బౌద్ధవిహారమని పాశ్చాత్య పండితులు.

6. అశ్వా – అశ్వేన – అనిత్యతృతీయైకవచనమని యాస్కుఁడు.

స + శ్వా – అశ్వా – శునకసదృశమని పాశ్చాత్యవ్యాఖ్య –

ఈనిరుక్తమునకు స్కాందుఁడు టీక వ్రాసెను. పిదపఁ బలువురు బహువ్యాఖ్యల వ్రాసినారు. పాశ్చాత్యులుకూడ వేదములకు చాలవ్యాఖ్యలు వ్రాసినారు.

కొన్ని పొరపాటులున్నను వారుకూడ మనవేదములయందు గౌరవముచూపినారనగా మనమెంతగా గౌరవించవలెనో! యూహింపుఁడు.

ఓం తత్సత్.

## జ్యోతిషము (5)

వేదములోనున్న ఈవిషయముకూడ దీర్ఘదర్శులైన కొందఱు మునులచే శ్లోక రూపమున వ్రాయబడినది !

"జ్యోతిష్" అనగా నక్షత్రము "జ్యోతిస్తారాగ్ని భాజ్వాలా" అని అమరసింహుండనెను. ఆ నక్షత్రములకు సంబంధించినవిశేషములిందు వివరించ బడుచున్నమాట ! గృహ్ణాతీతిగ్రహః అను వ్యుత్పత్తిచేత జంగమ స్థావరాత్మక పదార్థముల యదృష్టాదృష్ట ఫలముల నైకొని యుండునవని వ్యుత్పత్తి !

ఈ గ్రహములు సూర్య చంద్రాది నవగ్రహములు. ఈ తొమ్మిదిగ్రహములు "రెండుముళ్ళ గడియారములోని ముల్లుకలయందు తిరుగునట్లుగా" మేషవృషభాది ద్వాదశరాసులలో తిరుగును. అప్పుడుగల వివిధావస్థలు గల కాలము నీగ్రహములు సూచించును. ఈ విషయమును జెప్పునదే యీశాస్త్రము. ఇద్ది కదలకుండుచో లోకస్థితి స్తంభించిపోవును. మానవులు తమసుఖదుఃఖముల నీ శాస్త్రమూలమున గుర్తించి తెలిసికొని యథాయోగ్యముగా మోక్షానుసారముగా సంచరింపవచ్చును. దీనివలననే మనకు త్రికాలజ్ఞానము కలుగును.

ఈ నక్షత్ర గ్రహాదులన్నియు జ్యోతిస్వరూపములే గాన ఆకాశమునుండి కాలమును కాలధర్మములను మనజాతకములోని మార్పులను పుణ్యకాలములను గ్రహాదులను పుష్కరాదులను అమా పూర్ణిమా మున్నగుపర్వకాలములను మనకు

బోధించును. అప్పుడా యాయి వేదోక్త కర్మలద్వారా మనము పుణ్యము సంపాదింప నావకాశము కలుగును.

మనము చేయు ప్రతిపనికి శుభ సమయము కావలయును. అట్టి సమయమే గ్రహముల సన్నివేశ కాలము అని మనకీ శాస్త్రము బోధించును. ఆ సమయమున వివాహోపనయనాదుల జరిగించి సుఖములంద గలుగగలము. వెలుతురు సకలవస్తువులఁ జూపునట్లుగా నీ జ్యోతిశ్శాస్త్రముకూడ మనసుఖదుఃఖాదుల దెలుపును.

ఈ శాస్త్రము ముహూర్తభాగము గణితభాగము-ప్రశ్నభాగమని మూఁడు రకములుగా నున్నది. ఈ మూఁడుభాగములు మనకు ముఖ్యములే !

కాన నీశాస్త్రము వైదికకార్యముల నాచరించుటకు ముఖ్యము. గాన వేదాంగమైనది.

కాని నాయనలారా ! నేడీశాస్త్రము అజ్ఞుల కృత్రిముల చేతులలోఁ బడి కృశించిపోయి లోకమునే భ్రమంగఁ జేయుచున్నవి.

# 6. కల్పము

నాయనలారా! వేదములో అనేకకల్పములున్నవి. అంతేనా? మానవ కిల్బిషదూరములైన వ్రతములు భక్తిదాయకవ్రతములు వ్రతవిధానములు గలవు. ఈవ్రతవిధానమును బోధించునదే కల్పమనబడును. కావుననే ప్రతివ్రతప్రారంభమున

"కల్పోక్తప్రకారేణ యావచ్ఛక్తి ధ్యానావాహనాది" అని కల్పోక్తముగా నీ వ్రతముచేయుచున్నానని సంకల్పించెదరు.

వీనిలోఁ గొన్ని సూక్తములు కొన్నిసూత్రములు కొన్ని శ్లోకములుగానున్నవి- ధర్మబోధకములగుటచే గృహ్యసూత్రములను అశ్వలాయనుఁడు శ్రౌతసూత్రములను వ్యాసుఁడు బ్రహ్మసూత్రములనుజైమిని ధర్మసూత్రముల వ్రాసినారు. మొత్తమునకీకల్పముననే శ్రౌతగృహ్యధర్మసూత్రములున్నవి. సకలవర్ణాశ్రమాచారములు యాగవిషయములు మున్నగు వేద ప్రతిపాదిత విషయములవలననే కల్పము తెలియఁదగినది. ఇందుచే నిదియు వేదాంగమైనది. కాననే సూత్రరూపమున బలువురు మునులచే నిదియు నుద్ధరింపఁబడినది. కాని వీరిలో నాదభేదములు- ఆచారభేదములు-అభిప్రాయభేదములు గలవు.

శ్రుతయశ్చ భిన్నాః స్మృతయశ్చ భిన్నాః
మునీనాం మతయశ్చ భిన్నాః ?

అని యిదే చెప్పుచున్నది. ఆ సందేహము॥ నా శాస్త్రనే తీర్చును. వీనిలో సదాచారము శరణ్యమని యొకదారియున్నది ఎట్లనగా–

1. ప్రయాణము పోవునపుడు – (మనోజవమే ముఖ్యమని మాండవ్యముని యనును. శకునమే ముఖ్యమని బృహస్పతి యనును.

శ్లో॥ మనోజవంతు మాండవ్యః–
శకునంతు బృహస్పతిః–

2. శ్రాద్ధములో గర్త – భోక్తలు విభూతిధారణము చేయవలెనని యొకధర్మశాస్త్ర మతముకూడదు. శూన్యాల లాటములతో నుండవలెనని మరొక శాస్త్రవేత్తయు ననును? మనకిందేది యాచరణీయము?

3. బ్రాహ్మణుడు తేగలుతినవచ్చునని యొకనివాదన – తినకూడదని యొకనివాదన–

ఇట్లు పలురకములుగా ఆచారభేదములు అభిప్రాయ భేదములు గలవు– వీనిలో గొన్నియాచారము లొకదేశస్థులకని కొన్ని మరొకదేశస్థులకేయని నియమమున్నది.

కాని గురుశిష్య సంబంధము– యోనిసంబంధముల మూలమున వీరియాచారములవారు వారియాచారములవీరు ఆచరించుట కొన్నిచోట్ల తటస్థించుచున్నది– ఇట్టివిషయాలలో.

1. మునులో నొకరికన్న నొకరు గొప్పవారనియు–

2. తనపెద్దలమార్గనే తనకుశరణ్యమనియు నీ కల్పము బోధించును–

---

# భావతరంగములు

## 7. హిందూమతము

నాయనలారా !

మనకె హిందూమతము – హిందూదేశము – హిందూ పదము సింధు శబ్దవికృతిగాఁ జెప్పెదరు. హిందువుల మత మద్వైత మని రాద్ధాంతము.

ఈ మన దేశములో ఈ మన భారతదేశములో ఈ మన శ్వేత వరాహకల్పములో ఈ వైవస్వత మన్వంతర ప్రథమపాదములో ఈ గంగాగోదావరీమధ్యదేశములో ఈ పంతొమ్మిదివందల యేబది యాఱవ దుర్ముఖివత్సరములో వీధివీధికి ఫలహారశాలలవలె నింటింట చాకలికొట్లువలెనే యింటింట మంగలిశాలలవలెనే ప్రతియడుగున కాంగ్రెస్–కమ్యూనిష్టు–ప్రజా–స్వతంత్ర సోషలిష్టు పార్టీలవలెనే అనంత మతములు నాతలపై నిప్పటికే నెఱసిన వెంట్రుకలవలెనే ఆవిర్భవించినవి.

అందును మనహిందువులకుఁ గొత్తరుచి ప్రాతచేదు. అను సామెత సార్థక మైనది. నేటికి దేశములోఁ బుట్టి తప్పటడుగులు వేయుచుగొన్ని యెగఁబ్రాకుచుగొన్ని నడుచుచుఁ, గొన్ని పరుగిడఁబోయి పడుచు లేచుచుఁగొన్ని పరుగిడుచున్నమతములుగొన్ని పుట్టినవి పుట్టుచున్నవి. పుట్టగలవు. అవ్వి.

1. హిందూమతము – శంకరుడు దీనికి మతప్రవక్త
2. వైష్ణవమతము – రామానుజాచార్యులు దీని ప్రవక్త
3. శైవమతము–
4. బ్రహ్మసమాజమతము– రాజారామమోహనరాయలు
5. ఆర్యసమాజమతము–
6. రాధాస్వామిమతము – రాధాస్వామి–దయాల్బాగ్
7. సాయిబాబామతము – సాయిబాబా
8. క్రైస్తవమతము – క్రీస్తు
9. మహమ్మదీయమతము – మహమ్మద్
10. జైనమతము – జినుడు
11. మాధ్వమతము – మధ్వాచార్యులు
12. పాషండమతము–బృహస్పతి–దశావతారాలలో బుద్ధుడు
13. బౌద్ధమతము – బుద్ధుడు – శుద్ధోధనుని కొడుకు.

ఇట్లు అవాంతర భేదములచే బహురకములు పుట్టుచు, బట్ట కట్టుచు బ్రతుకు చున్నవి.

ఒక యింటనే యొకకుటుంబముననే యొక జట్టులోనే యొక కళాశాలలోనే భిన్నమతస్థులు గలరు.

మతము అనగా ఇష్టము అని యర్థము. కాన ఏవ రేమతము నైకొనినను గాదను వారుండరు. ఉండుటకు వీలులేదు. అందును మనకీవిషయము ప్రభుత్వమువారిచే చట్టముగా గూపొందింపబడనది. ఎవరిష్టము వారిదిగదా ! పెద్దలుచెప్పుట చిన్నలువినుట వెనుకకుబోయినది. కావుననేయొకమతమునజన్మించిన స్త్రీపురుషు లేమతమును బ్రవేసించినను తెలుగు లేదు.

నఱుఁగులేదు. అట్లు మతాంతరప్రవేశమునకు మూఁడు కారణములు ముఖ్యముగాఁ గన్పడుచున్నవి.

1. ఒక మతస్థుఁ డింకొక మతస్థురాలైనయువతిని ప్రేమించియామె పేరిమను పెళ్ళియాడుమని వెలిగింప ఆమెమతమును కైకొనును.

2. అన్యమతస్థురాలు ధనవంతురాలు, ఆమె డబ్బునకై యాసించియామెనువశ్యను గావించుటకై యామెమతమును స్వీకరించుట

3. మతప్రచారకుల మాయమాటలకు మోసపోయి యన్యమత ప్రవేశము చేయుట.

ఇంకను స్వల్పకారణములు పలురకములుగా నుండవచ్చును గాని యవన్నియు నీపై మూఁడింటిలోనే చేరును. ఇట్లు ప్రవేశించినవారు స్వమతములో నుండినప్పటివలెనే జీవితాంతసుఖము నందుచున్నారా ?

వారిమనోభావములు సారళ్యమార్దవములు వారియాచారవ్యవహారములునచ్చక తామచట మాటాడదమ్ములు స్వతంత్రించుటకు శక్తి,కాదనుటకుఁగ లేక, మొదటలైనపదార్థములు తినక సన్నగిలి యలో! లక్ష్మణా! ఇట్టిపనిచేసితి నేమిరా? అనియింటికిఁ బోవ నచటివారు వర్ణభ్రష్టుడు కులభ్రష్టుఁడని చేరనీయక గుమ్మము త్రొక్కనీయక భార్యాపుత్రులుకూడపలుకరింపక పోవగా నష్టపడుచుండుటవలన తెలియును.

పైమతస్థులారా! పరాయివారినిగా భావింపకుడు. స్వమతస్థులారా! దరిచేరనీయుడు. తనవారా! పలుకరించియాదరింపుడు. ఇకనాడు మనమట్టివారిలోఁ జూచుచున్నది—

నాయనలారా! ఈమతములలో నేదిగొప్పదంటురా ? ఎవరి నుప్పుకువారు తమమతమే గొప్పదని కొన్నిలాభముల వర్ణించుట- కాదనువారున్న శాస్త్రహాని కూర్చినుట పరిపాటి.

ఒక్క హిందూమతము లేక సనాతనమతము ప్రాచీనతమమైనది- వైదికమైననియమాలతో యాగాదులతోఁ గూడినది. దీనికి స్థాపకులెవరును లేరు. నీవుప్రార్థించి తపస్సుచేసిన నా భగవంతునిలో నైక్యమయి జన్మరాహిత్య నందుదువు. పాపపుణ్యముల సలుపుటలో నీవుస్వతంత్రుఁడవయ్యు మంచిపనులుచేసిన భగవంతునిలోఁ జేరుదువు. చెడ్డపనులచేసి నరకమునకుఁ బోదువనియు హిందూమతము బోధించును.

శైవవైష్ణవములుకూడ శివకేశవుల చెంతనుండుటయే నిజమోక్షమనియు వర్ణించును. జీవుఁడునీశ్వరుఁడు వేఱని వీరి రాద్ధాంతము, హిందూమతములో జీవేశ్వరుల కభేదము స్థాపించఁబడినది. క్రమముగా నాజీవుఁడేయీశ్వరుఁడు. అతఁడు నీహృదయములోనేయున్నాఁడని వేదములు సాక్ష్యము నిచ్చును

శ్లో- అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణస్థితః

నారాయణుఁడు నీహృదయములోనేగాక యావత్ప్రపంచము లోన బైట తానైయున్నాఁడట! ఈ శివకేశవులొక్కరే! కాననెవరిని సేవించిన నిరువురు సంతసించెదరని చెప్పును. వీరికి భేదమూహించరాదు.

శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే-
శివస్యహృదయం విష్ణుః- విష్ణోశ్చ హృదయంగంశివః-

శివకేశవ్రులొకరికొకరు హృదయాభిప్రాయులట! వారినే నీవు తిన్నగాఁ గొలువుము. మధ్యవారివలన ముక్తి నీకు రాజాలదని బోధించును.

మిగిలిన మతములట్లుగాక దేవదూతలనువారు క్రీస్తు-మహమ్మదు - రాధాస్వామి - మున్నగువారు నీపాపముల కై కొని నిమందుదయతో భగవంతునితోఁ జెప్పి నీకుముక్తిని ప్పించెదరని చెప్పుచున్నవి.

హిందూమతమునకు వేదములువలెనే క్రైస్తవమతమునకు బైబిల్ మహమ్మదీయ మతమునకు ఖురాన్ మున్నగుమతగ్రంథము లాయాప్రవక్తలైన మధ్యవర్తులచే వ్రాయబడినవి గలవు.

హిందూమత మొకదానిలోనే పునర్జన్మమరణానంతరసుఖదుఃఖానుభవము-కర్మలు-ప్రేతకర్మలు మున్నగునవిగలవు. గాని మిగిలినమతములకుఁ బునర్జన్మలే లేవు. దీనిగొప్ప యేమందురా?

నాయనా! వినుము

1. హిందూమతమున లేచినదిమొదలు పరుండువరకుస్నానసంధ్యాది నిత్యకర్మలు ఆబ్దికములు మున్నగునైమిత్తిక కర్మలు గలవు. ఇందుచే నీమతములోని వారందఱు నొకేయాచారవ్యవహారములతో నొకేజుట్టుబొట్టు కట్టులతో నుందురు.

2. ఇందు యుగయుగాలకు మార్పులులేని యవిచ్ఛిన్న దాంపత్య ధర్మమున్నది- ఇది పోగొట్టుకొందుమన్నను పోదు-

3. ఈమతమునుండి యితరమతములలోనికిఁ బ్రవేశించిన వారు మఱలనిందుఁ జేరుటకు వీలులేదు- వారికిఁ బ్రాయశ్చిత్తాదులు లేవు. వీరికి వర్ణసంకరుఁడనియు- పతితుఁడని పేరులు గలవు. కానవీరు తక్కువమందియున్న ఇతరులువచ్చి

ప్రార్థించినను జేర్చుకొనరు. ఇట్టి లితరమతస్థు నే హిందూ మతములో జేర్చినవారు హిందూదేశచరిత్రలో లేరు.

4. కాలానుసారముగా భోగము ననుభవించవలెను. నిషిద్ధ కాలములలో భోగముల కాసపడరాదు. సంభోగాదులకు పర్వదివసములు పుణ్యకాలములు నిషిద్ధములు.

5. జీవుడు గర్భస్థుడగునది మొదలు భూపతితుండగు వరకు జాతకర్మ- పుంసవన- సీమంతాది కర్మలచే నీవుని పవిత్రుని జేయుటకుగలవు

6. చనిపోయిన పిదప సునూరు మూటమూబది రెండువందల వత్సరములు లా జీవిచేసెడు నావధర్మములు - ఆబ్దికముల నిడుట యే మతములో నెఱుగుదురా ? చెప్పుడు-

7. శైవ వైష్ణవాది మతములందుగల భక్తి-పరిపత్తులు దేనికి గలవా ? అని ప్రశ్నించెదరు కాబోలు !

శ్రద్ధయాకృతమ్ - శ్రాద్ధం - కరుణయాకృతం కారుణ్యం- దయతో జేయబడునవి - శ్రద్ధతో జేయబడుకర్మలు హిందూమతమున నేగలవు. శ్రద్ధయను - నునవి భక్తిలక్షణము లే గదా ! కాన నవితరసాధారణ ధర్మములుకూడ నందుగలవు.

8. ఇందుడు జాతివర్ణ్యములకు వయస్సు- కాలముల ననుసరించి కర్మ - ధర్మములు నిర్ణయించబడి వారికి తరణోపాయమునకు దారిచూపినారు- అనయఃకాలములు దాటిన నాయువ నయన వివాహాదుల నాచరించనిచోవాడు పతితుడనియే మతము చెప్పుచున్నది.

9. దినమునకు రెండుమూఱులే భుజించవలెననియు దినమునకు మూడుమూఱులు స్నానసంధ్యావందనములాచ

రింపవలెనని శాసించినదీ మతమే!

10. అన్నదోషముండునుగాన శ్రోత్రియు లిండ్లలో యాచించి యైనను తినవలెను. (యాచయేత్ శ్రోత్రియస్యాన్నమ్.)

అన్నమందలి దోషము భోక్తకు సంభవించునుగాన సరియైన శ్రోత్రియాన్నమునే భుజింపవలెనని శాసించునది హిందూమతమొక్కటియే! కొందఱకు సాత్వికాహారము కొందఱకు రాజసతామసమైన ఆహారములు విధించినది.

11. కర్మలతోనే కాలము గడుపక సాంఘిక సేవ — విద్యాబోధ— అతిథిపూజలు సలుపుమని హిందూమతశాసనము.

అతిథి కిడకుండగా భుజించిన యన్నము స్వమాంసభక్షణ దోషమిచ్చుననియు— విద్యాదానము చేయనివాడు పిశాచముగా జన్మించునని బోధించునది హిందూమతమే.

12. ఏమతము బోధించని బ్రహ్మచర్యవ్రతము సాగుటకై విద్యాలాభమునకై పవిత్రకై గురుకులవాసమును విధించినది హిందూమత మొక్కటే! ఇందుకై గురువుచెంతకుఁజేర్చుటకే ఉపనయనమని పేరు—13. అంతమునవానప్రస్థుగానడవిలోనుండి యోగము నభ్యసించికోరికలఁత్యజించి సన్యసించి యోగమార్గమున ప్రాణత్యాగ మునర్పుమని చెప్పినదీ హిందూమత మొకటియే !

14 అహింసాపరమోధర్మః— అని యహింసయే పరమధర్మముగాన కామక్రోధాదులణఁగ పోవుటకై సాత్త్వికాహారమును బ్రహ్మచర్యమునుండి చచ్చువరకు నియమించిన దీమతమే! ఒకవేళ ఇతరుఁడు నిన్నుఁగొట్టినను, వాఁడునిమిత్తము, వాఁడు నిన్నుకొట్టువాఁడుగాఁడు. నీవుకొట్టబడువాఁడవుకావు—

నాఽయం హన్తి నహన్యతే

నీకర్మదోష మనియని యహింసా ధర్మమును బోధించినదీ హిందూమతమే !

15. కష్టములంబడి సత్యధర్మాదులచేఁ వరించిన హరిశ్చంద్రాదుల చరిత్రలుచెప్పి నీకు ధర్మసత్యముల యందు దాసక్తి కలిగించున దొక హిందూమతమేకాని యితరము కాదు-

16. స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ! జాయతే వర్ణ సంకరః భగ. గీత) అర్జునా! స్త్రీలు భ్రష్టయినచో వర్ణ సాంకర్యము కలుగును.

శ్లో- సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ
పతంతిపితరో హ్యేషాం లుప్తపిండోదకాః క్రియాః (భగ)

ఈవర్ణ సాంకర్యముచేఁ గులఘ్నులకు కులమునకు నరకము సంభవించుచున్నది- అంత ఆ నరకమునందు పితరులు లుప్త పిండోదకక్రియులై పతనముఁ జెందుచున్నారు. అనుభగవద్గీతా శ్లోకానుసారముగా స్త్రీభ్రష్టతవలన లోకమునకుఁగల హాని చర్చించినాఁడు-వారు నీతిభరితలై పతివ్రతలై యుండుటకై సీత, సావిత్రి, అనసూయ, ద్రౌపదిమున్నగుమహాపతివ్రతల కథలంజెప్పి వారిమనస్సును పాతివ్రత్యతపస్సులో లగ్నమగునట్లుచేయును.

1. సీత శత్రుగేహమున వత్సరకాలమున్నను హానిదూరకతనకర్మయని కర్మను నిందించుచు భర్తను స్మరించుచు నుభయ వంశములఁ దరింపజేసెను-

2. మరణించిన పతిప్రాణముల గొనిపోవుచున్న యమధర్మ రాజుతో నాతనిలోకమునకుఁబోయి యాతని దనధర్మవచనములచేమెప్పించి పతిని జీవింపఁజేసెను సావిత్రి.

3. తనను బరీక్షింపవచ్చినత్రిమూర్తులనే తనబిడ్డలగాఁ జేసి సంత సించి తన ప్రాతివ్రత్యశక్తిని లోకమునకు వెల్లడించెనుఅనసూయ

4. ఆయుమగుయ పతుల సహార్నిశలారాధించి వారితో వన ములకేఁగి యష్టకష్టముల ననుభవించెనుద్రౌపది –

ఇట్టి సతీమతల్లుల చరిత్రముచెప్పి భారతాంగనల పాతివ్రత్య ము నీనాటికిని శిరస్థాయిగా నొసర్చినదీ హిందూమతమే !

17. ఇంక మతమనగా భాషావిషయకమైన యాధిక్యము గలదా ? యని ప్రశ్నించెదరు గాబోలు ?

సాక్షాత్తుగా దేవభాష యీ మతముద్వారా భూలోక మునకువచ్చి మనచేవ్యవహారభాషగా గైకొనబడినది.

అందు ప్రభుసమ్మితవేదముద్వారా జ్ఞానబోధ యుత్తము లకు, సుహృత్సమ్మిత పురాణముల ద్వారా జ్ఞానబోధ మధ్య మాధికారులకు, కాంతాసమ్మితకావ్యములద్వారా జ్ఞానబోధ మందాధికారులకు జరుగుచున్నది. ప్రతిమానవుఁడు తరించుటకై జ్ఞానము నందవలెనుగదా ! త్రిమానవులననుసరించి వేదపు రాణ కావ్యములు వారిని సకలజ్ఞులుగాఁ జేయసమర్థములు– అజ్ఞానముచే వైరాగ్యమును దానిచే నీశ్వరచింతనము సల్పి ముక్తినందవచ్చును. ఈ మానవుల నిశ్శ్రేయసాధారమున విడ మర్చెనందువా ?

సత్త్వగుణ ప్రధానులు. వేదోక్తమునే నమ్మి యాచరిం చెదరు. రజోగుణభరితులు పురాణవాక్యముల నమ్మి తరించెదరు. తమోగుణప్రధానులు కాంతాసమ్మిత కావ్య వచనములనే నమ్మి బాగుపడియెదరు. ఈ మూడురకముల మానవులు ప్రతిమతమున నుందురు. మానవప్రవృత్తిని

బట్టి గ్రంథములపై విద్య యేయితరమతమున జూపగలవు? ఈ మూడింటిలోను విషయమంతయు నొకటియే !

పొడుపుకథల దగ్గఱనుండియు గల వేదములలో సాంఘిక సారస్వత రాజకీయ యంత్ర తంత్ర ఆధ్యాత్మిక ఆధిదైవికా విషయములకు లోటా? ఈ వేదరక్షణకు వేదాంగము లైన శాస్త్రములు ఆగమములు — ముఖ్యములు, స్మృతులు ముఖ్యములని చెప్పవలెనా? ఈ గ్రంథసముదాయములో మనుజున కనవసరమైన యసహ్యముకలిగించిన విషయముగాని గ్రంథముగాని యందలి యొకవాక్యముగాని జూపగలవా? ఈ సంస్కృతభాషయే యనంతభాష! వేదములనంతములు, ఈనాటి సైన్సుకన్న లక్షరెట్లుసైన్సు వేదములలో గలదు, వాటి నర్థము జేసికొనజాలని యవస్థలో మనమున్నాము.

18. ఇందులో స్వార్థ పరలోక హితములను దృష్టిలో నుంచుకొనియే ప్రతికర్మ విధించినారు, ఇందు వలన గొప్ప యాత్మోన్నతి — పరోపకారములు కలిసి వచ్చుచున్నవి. పెండ్లి యాగము తద్దినము మున్నగు ఏరకమైన కర్మను గైకొనిన ధన వ్యయము సలిపి యితరులకు మృష్టాన్నములు నిడుమనుటచే నాత్మతృప్తియు పలువురుసంతసించి జీవించుట పదుగుఱ సహాకారము వీరికి లభించుట — కాన ఎట్టికార్యము నైనను దాన ధర్మములు — శుచి — సంఘసేవ — ఉత్తమ మనస్సు — ఇవ్వి ముఖ్యములుగా విధించినది.

నాయనలారా !

ఆహారమును గూడా సాత్త్విక — రాజస — తామస — అను పేరులతో మూడు భాగములు చెప్పినదే మతమో

వాకొనుడు. ఇంతగా సంఘసేవ చేయించి యాత్మోన్నతిని సంపా
దించుచున్న మతమేది ?

చూడుడు - నాయనాలారా! శుష్క-ప్రియము జెప్పుట యే
గాదు. వ్యాసుని నాటినుండి మనయిండ్లకు ముందుభాగమున
నఱుగుల - ధనవంతులకు డాబాలు - మేడలు నిర్మించుటెందు
కో తెలియునా ? అతిథులకే !

పెండ్లి మున్నగు శుభకార్యములకు బదుగురు చేయుట-వారికి
భోజన - బహుమతుల నిడుట పరోపకారమునకేగదా !
ఆ కార్యకర్తకు బదువురు కూడ శారీరకముగా ఆర్థికముగా
వాచికముగా శ్రమదానము చేయుట యెందుకో! తెలియునా!
అన్యోన్య సహకారసూచనకే ! ఇట్లు సంఘములోని మనుజులు
తమలోతాము పరస్పర సహకారముతో జీవించిన చాలదు.
జంతువులకు, బీదలకు, గూడ మీరు సాయపడవలెనని
ధర్మశాస్త్రఘోష !

చూడుడు నాయనలారా ! తమజాతిలోని దుర్బలజంతు
వుల జంపితిని పొట్ట పోసికొనుటచే మృగములను జలచరము
లను రాజులు శూద్రులు వేటాడి ఆ తామసాహారమును
మీరు గైకొని బలసంపన్నులై దేశరక్షణము చేయవలెను.

తమకు దాపు నిడినచోట్లపై గూండ్లు నిర్మించి వాటికే బాధను
రోతను గల్గించు పక్షులను గోయువారు వేటాడి వానియాహార
ముతో జీవింపవచ్చును. అని సంఘశ్రేయస్సుకై ఈధర్మము నే
హిందూమతము బోధించినది. మఱల ఈ హింస హింస కాద
నియు లోకనాశక వస్తునాశనము దోషాపాదకము కాదని చెప్పు
చున్నది. మనదృష్టిలోని ధర్మమొకప్పుడు వేదదృష్టిలోనధర్మముగా
గోచరించును. మనకధర్మమే వేదచక్షువునకు ధర్మముగాదోచును.

1. దుర్యోధనుడు జన్మించుటతోనే భీష్మాదులందరు వంశక్షయ కారకుడగును వీనిని వెంటనే సంహరింపుమని ధృతరాష్ట్రునితోనే చెప్పినారు - కాని వాడు వినలేదు — కాని చంపించగా ఇది ధర్మమే యని యీ భారతమే ఘోషించుచున్నది.

2. తపస్సులో నున్న శంబూకుడను శూద్రుని రాముడు మృతవిప్రతనయుని జీవింపజేయుటకై సంహారము సలిపినాడు - ఇదెంతవరకు ధర్మము ? అనగా ధర్మమే యని యీ రామాయణమే బోధించుచున్నది.

3 దొంగతనముగా రుక్మిణిని గొనివచ్చి పరిణయమాడిన శ్రీకృష్ణునకు, పాపముకాదా ? కాదని యీ భాగవతమేబోధించుచున్నది, కాన ధర్మనిరూపణ శాస్త్రరీత్యా చేయవలెను గాని మన మనస్వబుద్ధితో యోచించి ధర్మసూత్రము నిర్ధరింపబోకుడు —

కాన నాయనలారా !

హిందూమతముతో సమానమైనమతము గంగానదితో సమానమైననదియు రామునితో సమానుడైనధనుర్ధారుడు హిమవంతముతో సమాన పర్వతము — సీతతో సాటియైన సాధ్వియు - శిబితో సమానదాతయు - వామనునితో సమాన యాచకుడు - వేదముతో సమాన మతగ్రంథము - లోకలోకాంతరములలో గాని జన్మ జన్మాంతరములలో గాని లేదు - ఉండదు

ఓం తత్సత్ —

# భావతరంగములు

## 8. దశావతారములు

అంతసారంగశాస్త్రి లేచి యొకఉత్తరమునుదీసి చదువ మొదలిడెను.

శ్రీ శాస్త్రిగారికి. నమోవాకములు- హైదరాబాద్

అయ్యా !

ఏదో! అనుకున్న తమసంఘముయొక్క యుపన్యాససంచిక వెలువడుటకై తహతహలాడుచుఁ జనువుచు ఆనందించుచున్నాము. ధన్యవాదములు.

మాకుక్కకు జబ్బుగానుండి వైద్యమునకై యీమాయామధ్య వచ్చినాను. దానికేల్లందునోయని మనోదుర్భావము చున్నాను. దానికాయురారోగ్యభాగ్యములు గలుగునట్లు ఆశీర్వదించుచుఁ దమకు దశావతారములగూర్చి చర్చించగా వినవలెనని వేడుక- నాచందాలోగడనే పంపితిని-గదా !

ఇట్లు - ఒకసత్యవాది

సోదరులారా! పాపమాశునకరాజముపై ఆ చతుష్పాజ్జంతువుపై ఆ భౌమ్ భౌమ్ ధ్వనిపునీతవదన గహ్వరభరితగ్రామసింహముపై ఆ సర్వభక్షకజంతురాజముపై ఆసేవావృత్తిజీవ

కమ్ముపై ఆ కుక్కపై ఆమహనీయునకు ఆ కాఫీ ఫలాహారశాలా స్థాప కాగ్రేసరునకు ఆ మహిపూర్తినంతరకన్యాగ్రహీతకుఆయన పత్నునకు ఆ గోదావరీ సేతు స్తంభతుల్యపాదునకు ఆ హస్త గృహీతశునక కంఠవిరాజితసువర్ణశృంఖలునకు నమస్కరించి నూతనిప్రస్తుతసంతానకల్పమైన ఆ యాఖండల తుల్యపరాక్రమ దర్దురమున కాయురారోగ్యైశ్వర్యములఁ బ్రసాదింప శత వర్ష స్వేచ్ఛాజీవితము సాగింపగా పుత్రపౌత్రాభివృద్ధి పొడము నట్లుచేయుగా నాదత్త్రతేయునకు ఆకాలభైరవస్వామికి సాష్టాంగ నమస్కరమాచరించి శ్రీ వారుకోరినట్లుగా దశావతార ములఁగూర్చి నేటిరేయి ముచ్చటించుకొందము.

భగవంతుఁడైన శ్రీహరి తనికూర్చుండ లేకతిన్న తిండి జీర్ణము గాక యీ సర్వేసు అమ్మోయాతో బుట్టినయాహారము జీర్ణ ముగాక యీ డాల్డావనస్పతి నెయ్యితోఁ జేసిన చక్రపొంగలి; దధ్యోదనము- పులిహోరలు పూర్తిగా జీర్ణముగాక భక్తులు గొలువవచ్చుచుండగా శ్రీ మహాలక్ష్మి పాదమునొత్తుచుండగా ఆదిశేషుఁడ హర్దివ ములు మోయుచుండగా నారదాదులువచ్చి సకలకాలములందు సంస్తుతులొనర్పగా సంవర్త - భగ్వాదులువచ్చి సౌఖ్యశాయనికులై పృచ్ఛింపగా సాగరములో క్షీరముల నశ్రమముగాత్రాగుచు హాయిగా ఆనందముగా యోగనిద్రలో గాలము దొరలించుకొనక యీమత్స్య కూర్మాద్యవతారముల నేల ధరించుననియా? ఎందుకీప్రయాస మనియా? ఏలనీశ్రమ భరిత జన్మముల దాల్చుటనియా? ఏల బ్రహ్మ క్షత్రియ - శూద్రాది కులజనువులనియా?

నాయనలారా! వినుడు.

ఆభగవంతుడే భగవద్గీతలో-

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం
వినాశాయ చ దుష్కృతామ్.
ధర్మ సంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే-

సజ్జన రక్షణ మునకై దుర్జననాశమునకై ధర్మ సంస్థాపనమునకై ప్రతియుగమున ఘట్టుచున్నాడట! ఆహా! ఆదయామయుడెంత మహోపకారి! ఎంత మానవోపకారి? ఆయనయే లేనిచో మన మెన్ని యిడుములఁగుడుచుచుందుమో! ఎన్ని యాతి బాధల నందెదిమో! ఆ మహనీయుని ప్రథమావతారము, వినుడు.

ఈ ప్రపంచ వయస్సు నాలుగు వందల ముప్పది కోట్ల వత్సరములు. అట్టి ప్రపంచ జీవితములో నేటికి నూటతొంబదియైదుకోట్ల వత్సరములు గడచినవి. ఇంకను రెండు వందల ముప్పది యేడుకోట్ల వత్సరములు గడువవలెను. నేటికి సరిగా హిందూదేశము పుట్టి నూటతొంబది యైదుకోట్ల యేబది యెనిమిదిలక్షల యెనుబది యైదు వేల యేబదియాఱు వత్సరములు గడిచినవి.

ఇంక నీసృష్టి ప్రారంభమునుండి పుణ్య పాపములతో సుఖదుఃఖముల ననుభవించువారు కొందఱు, ముక్తినంది భగవంతుని శ్వాసమాత్రులై యున్నవారు కొందరు, ముక్తికినై తపస్సులో దగ్ధులగుచున్నవారు కొందరు గలరు. ఈపుణ్యాత్ముల దుశ్చరితుల బారిపడకుండగా రక్షించుటకై శ్రీహరి. దయామయుఁడై

శ్లో॥ మత్స్యః కూర్మో వరాహశ్చ
నారసింహశ్చ వామనః
రామో రామశ్చ కృష్ణశ్చ
బుద్ధః కల్కి రితేవచ-
అని దశావతారముల దాల్చుచున్నాఁడు.

# 1. మత్స్యావతారము

గడచిన కల్పాంత వేళయందు ద్రవిడదేశాధీశుఁడైన సత్యవ్రత మహారాజు జలమాత్ర భక్షకుఁడై గంగాతటమున శ్రీహరికై తపించుచున్నాఁడు.

ఒకనాడతఁడు భాస్కరున కర్ఘ్యమిచ్చుచుండగా ఆతని దోయిలిలోకినొకచేపపిల్లరాగా ఉలికిపడి దానిని నీట విడిచెను. అంతట నామత్స్యమాతనితో "రాజా! నాకు దాయాదులైన సాటి చేపలవలన మరణభయము సంప్రాప్త మగుచుండగా నీవు రక్షించెదవని నీయంజలిలోఁ బడితిని. ఆ పన్నను నన్ను నీవు నీట ద్రోయుట పాటిగాదు. అనెను, అంత దయామయుడైన ఆ రాజు దానిని తన కమండలములో నుంచికొని తన యింటికిఁ గొనిపోయెను. ఆరేయి ఆమత్స్యము తనశరీరము నాజలపాత్రలోఁ బెంచిపెద్దచేసి రాజా! ఈకమండ లము నేనుండుటకుఁ జాలదు, ఇంతకన్న పెద్దపాత్ర దెచ్చి యందు నన్నుంచు మనెను. రాజుకూడ దానినొక పెద్ద పాత్ర ములో నుంచెను. దానియొడ లింకను బెరుగుచుండెను. దానిని గొనిపోయి యొక మూరకుడులో వైచెను. అమీాన శరీర

యింకను పెద్దదగుచుండగా నొక చిన్న సరస్సున నుంచెను. దాని తనువింకను పెరుగ నొక పెద్ద సరస్సున వైచెను. అదింకను పెరుగగా నొక సముద్రమున జేర్చెను.

మత్స్యము— రాజా! నన్నింతకాలము కష్టపడి రక్షించి యీ పెనుమొసళ్ళుగల సాగరములో వైచుట ధర్మమా?

రాజు— ఓ మత్స్యమా! నన్నిట్లు తిప్పలు పెట్టుచున్నావేమి? ఇంతటి ద్వారితముగా పెరుగు శరీరము నేనే జంతువునకుం జూడలేదు.

అని యా సత్యవ్రతుడు దివ్యదృష్టిచేత దీనిని శ్రీహరిగా గుర్తించి "మహాత్మా! భక్తుడనైన నాకు దిక్కైన నీవు మత్స్యముగా నెట్లయితివి?

శ్రీహరి— ఓ రాజా! నేటికి యేడవ రాత్రికి వర్షముచే నీ లోకములు నిండి రాత్రిగానుండును, భూమ్యాదిలోకత్రయము విలయాబ్ధిలో మునుగును. అంత నాయానతిచే సప్తఋషులతో పాములరాసులతో నోషధులతో నొక నావ తిరుగుచుండును. కానిచీకటిచే దారిగానరాకుండును. మునుల దేహకాంతులు దీపించుచుండగా నావ తేలుచుండును. నీవు కూడ ఆనావపై నెక్కుము. నేను మత్స్యమనై యీ సాగరతరంగములకు ఇతరజలచరములకు లోను గాకుండగా ఆనావను గాపాడుచుందును, రాజా నిన్ననుగ్రహించితిని. అని యా శ్రీహరి మాయమయ్యెను,

ఆ రేడు శ్రీహరిస్మరణతో దర్భశయ్యపైం దూర్పు తలగాం బరుండి యాశుభకాలమునకై నిరీక్షించుచుండెను.

అంతం బ్రళయరాత్రి సమీపించెను, వానలా! విపరీతముగా గురియుచున్నవి. చతుర్ముఖుడా! తనకు రాత్రి రాగుటచే బాహూపధానుడై నిద్రించుచుండగా హ్యాసరూపమున

బైటికి వచ్చు ఆమ్నాయముల హయగ్రీవుఁడను (సోమకాసురుఁడు) రక్కసుఁడు దొంగిలించి పారిపోయి పట్టుబడకుండుటకై సంద్రమున దాగెను, వానిఁ జంపి వేదములఁ గాపాడుపని శ్రీహరిపైఁ బడెను, అంత నాతఁడు జలధిసొచ్చి జలచరములతో స్వేచ్ఛగా విహరించుచుండెను.

అంతకు మునుపే శ్రీమన్నారాయణ ప్రేరితమైన నావ రాగా సత్యవ్రతుఁడద్దానిపై నెక్కి యందున్న ముని సంఘములతో నెదుట మత్స్యావతారుడైన శ్రీహరిని గాంచెను. ఆనావ నాదిశేషునితో ఆమత్స్యమునకు గట్టి శ్రీహరిని నుతించుచు మాయజ్ఞానమును బాపి గాపాడుమనియు నీలోఁ జేర్చుకొనుమనియుఁ బ్రార్థించు మునులకు శ్రీహరి బ్రహ్మస్వరూపమునుపదేశించెను.

అందుచే తరించిన యాభూపతి వివస్వంతుఁడను పేరుగల సూర్యునకు శ్రాద్ధదేవుఁడను పేర జనియించి శ్రీహరి కృపచే నేడవమను వయ్యెను.

ఆరాత్రి యాదనుజుని యొద్దనున్న వేదముల మొరవిని వానినుక్కడగించి ప్రాజమువుల నాహరి కాపాడెను.

నిదుర లేచి శ్వాసయాడక వేదములు లేక వెతనందుచున్న విధాతకావిద్యల నుదయముననే శ్రీహరి ప్రసాదించెను.

ఇది భాగవతములోని మత్స్యావతార కథ.

దీనివలన జీవుఁడు ప్రథమమున మత్స్యమువలె అతిచంచలముగా నజ్ఞానావస్థలో నుండునని దోచుచున్నది. 2. జ్ఞాన రక్షణమే పరమేశ్వరుని కర్తవ్యములలోఁ ముఖ్యముగాన ఆపని మానవులకు ముఖ్యాతిముఖ్యమని చెప్పక చెప్పుచున్నది.

3. దుర్మార్గుల నుంచి దైన సజ్జనుల గాపాడవలెననియు నిది భగవల్లక్షణములలో నొకటనియు జెప్పనగును.

---

## 2. కూర్మావతారము

దేవాసురులు సముద్రమును మథించుచుండగా కవ్వము వంటిమంధర నగము దానిలో మునిగి పోవుచుండెను, వాసుకి యను సర్పరాజును మంథన రజ్జువుగా నొనర్చిరి, అంత విబుధుల ప్రార్థనచే నా శ్రీహరి కూర్మ (తాబేలు) వతారము దాల్చి సముద్రములో నడుమకు బోయి తనవీపుతో ఆ భూధరము నెత్తి పట్టివారి యమృత మధనములో దోడ్పడెను. పిదప నమృత మందిన వేల్పు లాశ్రీహరిని గొలిచిరి. ఇదికథ.

శిశుత్వావస్థలోనున్న జీవుడు కొంచెము తెలివిగని వాడు. మత్స్యాదులు జాలరుల వలలోని యెఱల కాశించి జాలరులకు లొంగిపోవును, తాబేలట్లు గాక వలలో దగుల్పడి నను తనవీపుపైనున్న ముఱుసులతో నుండగా జుట్టుకొని పోయి వివేకముతో గొంతదాక యాత్మరక్షణ గావించుకొనగలదు. బాలుడు కూడ క్రమముగా వయస్సు వచ్చుకొలది యాకలి యగునపు డేడ్చి యాత్మరక్షణ చేసి కొనగలడు, ఇక నింద మృతము వేల్పుల జాతికి మరణము లేకుండగా జేయునాహారము, దాని భక్షణము ఆజాతికి శాశ్వతోపకారము చేయగలదు. కాన దానిని సంపాదించు జతనములో వారికి సాయమొనర్చి శాశ్వత స్వర్గ్యమానుడై యా శ్రీహరి వెలసినాడు. ఇందుచే నొకవర్గమునకు శాశ్వతోపకారము చేయువాడనుట.

శాశ్వతోపకారము చేసినవాఁడు జాతియున్నంతకాలము మఱువఁదగని కీర్తి- స్థిరమైన పుణ్యము నందును. కాన జాత్యుద్ధర్తలు (నూతన) చెఱువుల ద్రవ్వించువారు. దేవాలయ ప్రతిష్ఠాపకులు. పాఠశాలల నిర్మించువారు మున్నగువారు. స్థిరముగా నుత్తమ లోకముల నందెదరు.



# 3. వరాహావతారము

హిరణ్యాక్ష - హిరణ్యకశిపులనువారు సోదరులు. బ్రహ్మకై తపించి లోకోత్తరవరములనంది గర్వించి లోకముల మారాయముగా వంచుచున్నారు - పతివ్రతలఁ జెఱచేయుట మునుల బంధించుట - గోవులఁజంపి మాంసములఁదినుట. సత్పురుషుల నవమానింపఁజేయుటయే వీరికి ముఖ్యవృత్తులు. విబుధుల పీడించుటయే వారికి సార్థకకృత్యము. వారిలో హిరణ్యాక్షుఁడు మదించి భూమినంతయుఁజాపచుట్టి సాగరమున బారవైచెను. వెంటనే శ్రీహరి వరాహ (పంది) రూపము గైకొని కోఱలతో ముట్టెతో వానినిబొడిచి చంపి లోకకళ్యాణముచేసినాఁడు.

దీనివలనజీవుఁడు కొంతపెద్దవాఁడై యుక్తాయుక్తవిచక్షణగలవాఁడై పరోపకారపరాయణుఁడై యగుచున్నాఁడు - ఇక్కడ పదియవతారములఁదాల్చుటకుఁ గారణమేమనగా - వరాహము ముఖ్యముగా జంతువులలో నహింసాప్రధానజీవి - పైగా నెవఱును నుపయోగించని మలమునుభక్షించి జీవించును. అశాంతముగాఁ బ్రశాంతవాతావరణములో జీవించును. కాని యట్టిపరమసాధువునకు వచ్చుకోపము హెచ్చి రెచ్చి

యెంతవారినైనఁజీల్చి చెండాడును. సాదు రేఁగిన తలపోలాస అనునీతి యిటనే సార్థకమగునేమో!

ఇట్టి సాధువులకు సంపూర్ణబ్రహ్మజ్ఞానముకూడ గలుగును – అని సూచించుటకై యీ హంసవతారము దాల్చెనేమో యనిపించును.

---

# 4. నరసింహావతారము

వైకుంఠద్వారపాలురైన జయవిజయులు సనకసందనాదులు లోనికిఁబోవనడ్డగించి శ్రీహరితో వియుక్తులగుదురుగాక! అని శప్తులైరి వారే యీ కృతయుగమున హిరణ్యాక్ష - హిరణ్యకశ్యపులుగా జన్మించి శ్రీహరికి విరోధులై ప్రవర్తించుచుండగా వారిలో హిరణ్యాక్షుని శ్రీహరి వరాహావతారము దాల్చి సంహరించెను.

ఇఁక హిరణ్యకశిపుఁడుకూడఁ దనసోదరుని శ్రీహరి చంపెనగాన నాతనిజంపవలెనని యాహరికై యన్నిలోకములందు నాన్వేషలు అనుచరులతోఁ దిఱుఁగుచుండెను. కాని శ్రీహరి వానికిఁగన్పడలేదు. అంతనాతఁడు వనమునకుఁబోయి విధాతకై ఘోర తపమొనర్చి యాతనిబ్రసన్నునిగాఁ గావించెను. వరముఁ గోరుకొనుమన్న పద్మభవునితో నాభక్తాగ్రణి యేమనుచున్నాఁడో! పోతన్నగారేమనిపించుచున్నాఁడో! వినుఁడు –

శా॥ గాలిం గుంభిని నగ్ని నంబువుల నాకాశస్థలిన్ దిక్కులన్
రేలన్ ఘస్రములన్ దమఃప్రబలభూగ్రాహనక్షత్రమృగ

వ్యాళాదిత్య నరాది జంతుకలహావ్యాప్తిన్ సమస్తాస్త్రశ
శస్త్రాళిన్ మృత్యువు లేనిజీవనము నాకాధీశ! యిప్పింపవే!

ఇంత కట్టుదిట్టముగా వరముగోరినను ఆభక్తవశంకరుఁడు సంబరపడి తథాఽస్తు అని భక్తునకు దీవనలిడెను.

దానిచేగఱువమంది యాదైత్యుఁడు సురలోకములాక్రమించి యాగ - విప్ర - ధేను - పతివ్రతలను బాధించుచు సోదరఘ్నుఁడైన శ్రీహరివధకై తిరుగుచుండెను.

ఈతపస్సమయములో మహేంద్రుఁడు వానియంతిపురికి జొచ్చి వానివామాక్షి గర్భవతి యైనలీలావతిని బలాత్కారముగాఁదనరథముపైఁగూర్చుండఁబెట్టుకొని యామెగర్భమందలి యర్భకునిఁ జంప గొనిపోవుచుండెను. దారిలో జడదారి నారదుఁ డడ్డపడి యాతనిని జీవాటులఁబెట్టి యామెనుగొనివచ్చి తనయాశ్రమముననుంచి నిదురించునామెగర్భములోని యర్భకునకు శ్రీహరిభక్తిబోధించి గాపాడుచుండెను. అంతలో నటకు వచ్చిన యాహిరణ్యకశిపునకు వానియాలినొప్పగించి విషయమంతయువిన్నవించెను. వాఁడుచు సంబరపడి యామహేంద్రుని పనిబట్టెదననిపలికి పత్నినింటనికవిడిచి జైత్రయాత్రలకుబయలుదేఱెను. వాఁడు పిదప సులువుగావిగీశులనిర్జించి దేవలోకముబడైత్యప్రతినిధులచే పాలించుటకేర్పరచి యింటికిరాగా వానికి శ్రీహరిభక్తుఁడైనబుడతఁ డుదయించెను. వానిభక్తికచ్చెలువంచి బాల్యమనుకొని చండామార్కులను శుక్రవంశజులయొద్దఁ జదువునకొప్పగించెను. కాని యాబాలుఁడు శ్రీహరి భక్తి మానఁడయ్యెను.

అంత వానిని మాన్పింపఁజాలక చంపఁదలచి పాములచే కరిపించి కొండలనుండి దోయించి గజములచే త్రొక్కించి గరళభక్షణము గావింపఁజేసినను మరణించక క్షేమముగానున్న బాలకుఁడు ప్రహ్లాదునితో ఓరి! ఆ హరియెచట నున్నాఁడురా? అని ప్రశ్నింప ఆ పిల్లవాఁడు బ్రహ్మజ్ఞానిగాన శ్రీహరినే నమ్మి యున్నాఁడుగాన,

కం॥ ఇందుఁగలఁ డందు లేఁడను
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకిజూచిన
నందందే కలఁడు, దానవాగ్రణి! వింటే!

అని జవాబీయఁగా వాఁడు క్రోధ సమాక్షేక్షణుఁడై యో? ! ఈ స్తంభమునజూపు మాహరిచని గదతోఁ గొట్టగా దాని జీల్చుకొనివచ్చి శ్రీహరి నరహరిరూపముతో వానివర ముల కాటంకము గలుగకుండగా దైత్యునిజంపి భక్తుఁడైన ప్రహ్లాదుని గాపాడెను. ఇది నృసింహచరిత్ర.

ఇంక జ్ఞానముసగము అజ్ఞానముసగము గలది మృగము, జ్ఞానము మూఁడుపాళ్ళు-అజ్ఞాన మొకపాలు గలవాఁడునరుఁడు ఇప్పుఁడు నరహరిగాన అజ్ఞానము డెబ్బదియైదుపాళ్లు, జ్ఞానము నూటపాతికపాళ్లుగలది నృసింహము. దీనిలో జ్ఞానభాగము నరుఁడు.

అజ్ఞానభాగము సింహము. కావుననే జ్ఞానభాగమడుగున శరీరరూపముగా నజ్ఞానభాగము హెచ్చుగానున్నఁదైన శిరో రూపమున గలవాఁడు. కానిఈతఁడు భక్తుఁడైన ప్రహ్లాదుని విబుధులఁ గాపాడుట, పతివ్రతయైన లీలావతిని పతి వియోగ

దుఃఖమునుండి పరిరక్షించుట అనునవి జ్ఞాని కృత్యములు. దుష్ట దానవ విధ్వంసనము. ఈశ్వరుఁడు తానని స్థాపించుకొనుట, ధర్మరక్షణముచేయుట, యివి మృగరాజైన సింహకృత్యములు.

దీనివలన ప్రభువులు తప్పక ధర్మరక్షణ మాచరించవలె నని లోకమును బాలించవలెననియు తెలియుచున్నది, దీనిచే పాపపుణ్యములలో నరమృగయోగ్యతలు వర్ణించఁబడినది

---

# 5. వామనావతారము

వేఁదులందఱు గర్వించి యుక్తాయుక్తవివేకము లేక సాధుబాధసలిపి దానవులై దుష్కృత్యముల సలుపుచున్నకాల మది. ఇందు ధర్మనాశనము తప్పకుండునా ? ధర్మము రాక్షస ధర్మము గాన ధర్మవ్యవస్థలు కూడఁ దలక్రిందలగుచున్నవి.

ఆ నాటివారలకుఁ బ్రభువు బలిచక్రవర్తి ఈతఁడు ప్రహ్లాదుని కొడుకైన విరోచనునకుఁ దనూజుఁడు.

కాని యీతఁడు మాశ ను మరద్వేషియైనను దాన— సత్య దయాది సద్గుణములతో జగముఁ బాలించుచుండెను. కాని లాభమేమి ? అతిదాత ! దానికిదోడు దేవద్వేషము, అతి త్యజించదగిన గుణములలో నొకటి గదా! అతిసౌందర్యము వలన సీతహరింపబడినది. అతిగర్వముచే రావణుఁడెవరు చెప్పినను వినక జానకినిదెచ్చి నశించెను. అతిదానమువలన బలి బంధింపఁ బడినాఁడు.

శ్లో= అతిరూపా ద్ధృతా సీతా
అతిగర్వా ద్ధతో రావణః
అతిదానా ద్బలిర్బద్ధః
అతి సర్వత్ర వర్జయేత్—

అనేగదా! అమరులను బారద్రోలి వారిలోకములను గొనెను బలిరాజు. విబుధపాలనను క్షణములో కైటభాది దైత్యులు కైవశము చేసికొనిరి, భూలోకమున గొండగుహాలలో వసియించలేక యింద్రాదు లాక్షీరోదశాయి కడకుంబోయి మొరయిడిరి. త్వమేవ శరణంనః మాకు నీవేదిక్కని యాలోచించిరి, ఓదార్చెడా శ్రీహరి ?

ముల్లోకముల అదితి శ్రీపతికై తపస్సుచేయం బ్రత్యక్షమై వరము కోరుమనగా నామె నాతనయులు విబుధులం గాపాడుమన్నది. అంత భగవంతునిచే బోతన్నగారు చెప్పించు సమాధానము వినుడు.

శా= నీకోడండ్రును నీకుమారవరులన్ నీనాథుడున్నీవు సం
శ్లోకింపన్ సతులుం బతుల్ మిగులసమ్మోదింప రాత్రించరుల్
శోకింపన్ భవదీయగర్భమునం దేజోమూర్తి జన్మించెదన్
నాకు న్వేడుకపుట్టు నీసుతుండనై నర్తించి వర్తింపగా—

అని యామదితి కశ్యపులగడుపుల వామనాఖ్యతో జనించెను, సకలవిద్యలాభాలకునకు స్వయముగా నేలరావు? ఆతని పేరుకుందగినట్లు పొట్టివాడు! ఒకనాడు వరదేశబ్రాహ్మణులవలన బలి యాగముసలుపుచు సకల దానముల సలుపుచున్నాడనవిని యాతని యాగశాలకేగి తన దివ్యరూపముచే వారినాకర్షించి యాబలి నిట్లు వామనుడు పొగడుచున్నాడు. పోతన్నగారి భాగవతము నుండి.

మ॥ ఇతఁడే దానవచక్రవర్తి! సురలోకేంద్రాగ్ని కాలాది ది
క్పతిగర్వాపనయప్రవర్తి! గతశోభసూర్యాప్తి నానామఖ
వ్రతదాన ప్రవణానువర్తి సుమనోరామామనోభేదనో
ద్ధతచంద్రాతపకీర్తి సత్యసుమనోధర్మోల్లసన్మూర్తి తాన్.

వ॥ కుశపవిత్రాక్షత సంయుతంబగు దక్షిణ హస్తంబు సాచి...

ఉ॥ స్వస్తి జగత్త్రయీభువనశాసనకర్తకు హాసమాత్రవి
ధ్వస్తనిలింపభర్తకు నుదారపదవ్యవహర్తకున్ మునీం
ద్రస్తుత మంగళాధ్వర విధానవిహర్తకు నిర్జరీగళ
న్యస్తసువర్ణ సూత్రపరిహర్తకు దానవలోక భర్తకున్-

అని యావటువుపొగడుసరి కాయజమాని యీపిల్లవాని తేజోవిశేష వాఙ్నైపుణుల కబ్బురపడి గురువైన శుక్రుఁడు వారించుచున్నను వినక "వటూ! నీకేమి కావలెన"నెను. తపస్సునకు మూఁడడుగుల మాత్రపునేల వలయునని యాపొట్టి వానిజవాబునకు శుక్రుఁడచ్చెరువంది బలితో నీవితనికి దాన మీయవలదని బోధించెను. కాని శిష్యుఁడు మొండికెత్తి విన లేదు. ఈతఁడు భగవంతుఁడు విన్నణగ ద్రొక్కవచ్చినాఁడని గురువు హితబోధచేసెను. భగవంతునకు దానమిచ్చుటకన్న నా జనువునకుఁ గావలసినదేది? అని శిష్యుని పట్టుదల! అంత నూఱకొన్నాఁడా! భార్యను "హస్తమున నీరుపోయుమని" దానమున కుపక్రమించినాఁడు ఛాత్రుఁడు- జారికొమ్ములో నడ్డుగాదూరి నీరుపడకుండాఁజేసినాఁడు గురువు. భగవంతుఁడు "ఈ జారీకొమ్ములో ఏదో యడ్డుతగులుచున్నదని" దర్భపుల్లతో

బొడిచినాఁడు. గురువు గ్రుడ్డివాఁడయ్యెను. దాతలచెంతకుఁ బోయి దానమునిషేధించువారికి గ్రుడ్డితనమే ఫలితముకాబోలు!

జారీనుండి నీరుపడినది, దానము పూర్తియైనది. విశ్వరూపుఁడు దేహము పెంచినాఁడు. ఆకాశ మొకయడుగుతో సరిపెట్టి భూమి నొకయడుగుతో సరిపెట్టి మూఁడవయడుగు నకుఁ దావెక్కడ? అని యడిగినయాచకునతో ఆదాత యయ్యా! నాశిరస్సే తావని జవాబిచ్చినాఁడు. దానికిఫలితముగా నాదాతకు పాతాళరాజ్యపాలన సంభవించినది. [illegible]లమాటవినని వారికధోగతియే కాబోలు? ఇది వామనావతార చరిత్ర.

గర్వితుల గర్వము గంగపాలుచేయుట యుత్తమ కృత్యములలో నొకటి! మఱియు నతిదానవలన బలి బద్ధుఁడైనాఁడు కాని దానిఫల మూరకపోవునా? పాతాళరాజ్యపాలనము.

---

## 6. పరశురామావతారము

క్షత్రియులందఱు హెచ్చుగా విఱ్ఱవీఁగుచుఁ బరస్త్రీ పరధనములు మఱిగి మంచిచెడ్డల మాటయేలేక వర్తించుచున్న కాలమది. క్షత్రియులు గర్వించుగాలమున వారినణచుట బ్రహ్మణకృత్యముగదా! అట్టి ధర్మరక్షణమునకై రేణుకా జమదగ్నులకడుపున పరశురాముఁడనుపేరిట శ్రీహరి జన్మించెను. పెరుగుచుండెను. ఈతఁడు సోదరులలో మూఁడవవాఁడు.

నాఁడు కార్తవీర్యార్జును డను రాజు హైహయ వంశసంజాతుఁడై శివకటాక్షముచే సహస్ర బాహువై రణభీముఁడై యరిభయంకరుఁడై యుండెను. వాఁడొకనాడు వేటకువచ్చి జలాశయమునకునీటికై వచ్చిన రేణుకనుగాంచి కామమోహితుఁడై వెంటనంటెను. ఈసంగతి యామెయెఱుఁగదు, దివ్యదృష్టితో దీనిని గాంచిన జమదగ్ని కొమరులఁబిలిచి కారణము చెప్పక మీతల్లిని జంపిగొనిరండని" శాసింప రాముఁడొక్కఁడే యంగీకరించి చెఱువునుండివచ్చు తల్లిదలను నఱికి యామెకళేబరము భుజమున వైచుకొని తండ్రియెదుటనుంచెను.

అందుకు సంతసించిన జమదగ్ని నాయనా! వరము వేఁడుమనగా నాతల్లిని బ్రతికింపుమని కోరెను. జనకుడు "తథాఽస్తు" అనగా నామె లేచినది. అదిమొదలారాముఁడు క్షత్రియ సంహారము చేయఁదలంచి కార్తవీర్యుని రణమున జంపి యాకోపముతీరక యిఱువదొక్క మాఱులుపుడమినంతయు గాలించి రాచపురుషుల నేలరాచివైచెను. ఇదేయిందు ముఖ్య కథ! జీవుడు జ్ఞానభరితుఁడు స్వతంత్రుఁడు గాన ధర్మవృద్ధిని అధర్మనాశనము సలుపుచున్నాఁడు.



## 7. రామావతారము

ద్వాపరయుగమునకౌసల్యాదశరధులతనయుఁడై వేల్పుల ప్రార్థనచే నయోధ్యలో జన్మించినాడు భగవంతుఁడు. జననాంతరమున అదితి కశ్యపులే యీకౌశల్యాదశరధులు. ఈతఁడు సోదరుఁడైన లక్ష్మణునితోఁబోయి కౌశికుని యాగముగాచి

జనకజసుబెండ్లాడి తండ్రియానతిచే వనమునకుఁబోయెను. అచ్చట మునిసేవ్యుఁడై తిరుగుచుండి పంచవటిలోవసించి శూర్పణఖను బరాభవించి రావణాపహృతభార్యుఁడై వాలి వధగావించి సుగ్రీవునకుఁ బట్టాభిషేక మొనర్చి హనుమత్సుగ్రీవాదివానరుల సాయమున వారిధికి సేతువుగట్టి సంగ్రామమున రక్కసులగూడ రావణుని బీచమడచి చంపివిభీషణునకు లంకాధిపత్యమిచ్చి పుష్పకముపై జానకీ లక్ష్మణ సేనాపరివార సహితుఁడై యయోధ్యకు బోయి పట్టాభిషిక్తుఁడయ్యెను.

శ్రీహరి భూభారహరణముకై నరుఁడు రాముఁడుగా జన్మించి మానవధర్మములతో నటించి సాధుపాలనము, దుష్టశిక్షణము గావించినయవతారము.

జయవిజయుల రెండవజనువే యీరావణ కుంభ కర్ణుల జననము–

---

# 8. కృష్ణావతారము

ఇందు జయవిజయుల మూఁడవ జనువులే యీశిశుపాల దంతవక్త్రుల రూపములు. శ్రీహరి విబుధుల–భూదేవి ప్రార్థనము చే దేవకీవసుదేవులకష్టమగర్భమైపుట్టి నందగోకులమున బెట్టి గిబాల్యమునుండియుపూతనాశకటాసుర తృణావర్తయమళార్జున తను భేత్తమై కంసునివధించి తలిదండ్రుల చెఱవిడిపించి క్రమముగా శిశుపాల దంతవక్త్రా–దులజంపి పాండవరక్షకుడై దుర్యోధనాదులఁ జంపించినాఁడు. నూటయిఱువది నాలుఁగేండ్లు భువిని

పాలించినాఁడు, పలుమాఱులు తన విశ్వరూపమును బలువు
రకుఁజూపి తాను భగవంతుఁడనని" నమ్మింపఁజూచినాడు. నమ్మ
నవారిని నాశనము గావించెను. ఈయవతారమున మహాజ్ఞా
నిగా నటించెను, కాని దుష్టులు గ్రహింపఁజాలకపోవుటచే
సంగ్రామమున సర్వనాశనము తప్పలేదు,

---

## 9. బుద్ధావతారము

ఈ బుద్ధమూర్తి మాయాదేవికి శుద్ధోదనుని వలనఁబు
ట్టినవాఁడని యితని కాలుబిడ్డలు గలరని విమర్శకులు సంస్కృత
గ్రంథములుకూడ సాక్ష్యమిచ్చుచున్నవి.

శ్లో॥ సశాక్యసింహ స్సర్వార్థ స్సిద్ధశ్శౌద్ధోదనిశ్చ సః
గౌతమ శ్చార్కబంధుశ్చ మాయాదేవీసుతశ్చ సః

అని అమరకోశములో నమరకారుఁడు సాక్ష్యమిచ్చు
చున్నాఁడు, ఈతఁడు బౌద్ధుఁడై యుండనోపు- నాఁడు మనదే
శమును బౌద్ధసన్యాసులు బౌద్ధరాజులు పాలించిన దివసాలలో
నీగ్రంథముపుట్టి యుండవచ్చును, లేక యీయమరకోశమున
బుద్ధునకు బర్యాయఁడే యీతఁడని యెక్కడున్నది? ఇంక నీ
పక్షమున ఈదశావతారబుద్ధుఁడెవఁడని ప్రశ్నరావచ్చునుగదా!
ఆతనిగూర్చి పద్మపురాణములో నున్న యీకథ చెప్పుచున్నాను.

నాయనలారా! త్రిపురాసురుని సంహరించుటకై త్రి
మూర్తులు మహేంద్రాది పరివార పరివృఢులై దండెత్తి వచ్చి
నారు. దానికిఁగారణ మీదైత్యుఁడు వేల్పులనోడించి వారి

స్వర్గమందున్న యమృత భాండమును హరించి తెచ్చి తన యింట కుండికనిర్మించి యందుభద్రపఱచుటయే యీకయ్యము నకుఁగతముగదా !

ఆ త్రిపురునకు మహాపతివ్రతలైన మూఁడు వందల ధర్మపత్నులు గలరు. వారు రణమునకుఁ బోవుచున్న తమ నాథునకు నుదుట వీరతిలకమిడి తమ చీరకొంగులఁజింపి మేమే నిజమైన పతివ్రతలమైనచో నీకీ రణమున విజయము చేకూరుఁ గాక ! అని ప్రమాణపూర్వకముగా ఆకొంగుముక్కలను వాని ముంజేతికిఁగట్టి పంపిరి.

దానిచే వాఁడాసంగరమున శంకరాదుల కజేయుఁడై మధ్యాంనమార్తాండునిభాతి వెలుంగుచుండెను. వాని కోడి వేల్పులు పారిపోవుచున్నారు,

అంత కేశవుఁడు గోవుగామారి మహేంద్రుఁడు దూడయై వెంటరాగాఁద్రిపురుని అంతిపురికేఁగి రహస్యముగా ఆకుండిక లోని యమృతమునంతయుజుఱ్ఱి మాఱాడకవచ్చి స్వర్గమును జేర్చినాడు ఇక్కడ యుద్ధములోనికి వచ్చిచూడగా శంకరాదు లలసిసొలసి యేమిచేయుటకుఁదోచక మెల్లగా సంగ్రామము సాగించుచున్నారు.

అంత వెన్నుఁడు వీనివిజయమంతయు వీనిసతుల పాతి వ్రత్యశక్తిగాగ్రహించి తాను రణరంగమునువీడి సన్యాసి వేష ముదాల్చి బుద్ధుఁడనని తెలిసితినని చెప్పికొనుచు వానినగరోప కంఠమునగూర్చొని వచ్చిపోవువారి ప్రశ్నలకు సరియైన జవా బులఁజెప్పుచుండెను. ఈతఁడు గొప్ప జ్యోతిష్కుఁడని సర్వజ్ఞుఁ

డనియు నూరిలోనివారు చెప్పుకొనుచు వచ్చిపోవుచున్నారు, ఈసంగతి వానిరాణులకుఁ దెలిసి యీతని దరిసెనమునకువచ్చి నమస్కరించిరి. స్వామీ ! రణరంగముననున్న మా నాథునకు విజయలాభము చేకూరు మార్గముపదేశింపుఁడని ప్రార్థించిరి. అందుకు సంతసించిన యాబుద్ధుఁడు వారికి నాస్తికమతము బోధించును. మీశరీరమును స్పృశించుచు నొకమంత్రమునుపదేశించెను. దానిని జపించుచుండిన మీధవునకు విజయముగలుగునని చెప్పెను వారుసందేహించుచుసరియే యనియంగీకరించిరి. అంత వారి వెన్నుఁదట్టుచు మంత్రోపదేశ మొనర్చుచుండగా వారికందఱకు గగుర్పొడిచి కామవికారమంకురించినది. దానితో వారి పాతివ్రత్యమంతయు భగ్నమైనది. అంత శ్రీహరి చల్లగా మెల్లగా తొలఁచినది జరిగినందుకు సంబరపడుచు సంగరమునకు వచ్చి హరునితో విషయమంతయు విన్నవించి యుద్రేకించి యుద్ధము సలుపుఁడనెను.

విబుధులందఱు సంజాతానందాశ్రుపరీతనయనులై ఆయుధములదాల్చి ధనువులదాల్చి దైత్యులఁ జీల్చిచెండాడి చంపుచున్నారు.

అంత కపర్ది యుగ్రుడై ధనువునుగైకొని దానియగ్రమున శ్రీహరియుండగా విడిచి దానిని జీల్చిచంపెను. ఇదికథ.

మాయావులయందుఁ బ్రయుజ్యమానమాయ దోషకారి కాదనునీతి యీకథవలన వ్యక్తమగుచున్నది, కర్మఫలము విబుధులకేగాదు. ఎవరికైనను దప్పదనునీతి యిందుచేఁ దెలియుచున్నది.



# 10. కల్కి అవతారము

ఇది కలియుగాంతమున సంభవించును. నాటిస్థితి, కలిదోషమువలన వర్ణాశ్రమధర్మములు చాలభాగము నశించును. నాటి జనులకు పరమాయుర్దాయము 20.30 వత్సరములే! అంగుళీ మాత్రప్రమాణముగా నుండును. 12 వత్సరములే పరమాయుర్దాయమనియుఁ గొన్ని మతములుగలవు. వేదశాస్త్రములు నిరాదరణతో సామాన్యవిద్యలుగానే చూడఁబడును. ధర్మము నాస్తికముతోఁ గలిసియుండును. భూపాలురు దొంగలతో సమానులై పన్నులపెంచి లోకము నాపదలపాలు చేయుదురు. తామ వారు దొంగలతో సమానులగుదురు.

మనుజులకు దొంగతనము, వ్యభిచారము, అసత్యము, వధ-హింస యివియే ముఖ్యవృత్తులగును. అన్నివర్ణములవారు, శూద్రప్రాయులగుదురు. గోవులు తమపూజ్యతను విడవాడి మేకలగొఱ్ఱెలతోఁ దుల్యముగాఁ జూడఁబడి వధింపబడును. నాశ్రమములు గృహాశ్రమములు కదా! జార-చోరస్థలు శాహోటములగా గౌరవవతులుగాఁ బరిగణింపఁబడును. స్త్రీధర్మములు పురుషధర్మములుకూడ పోసఁగవు. చమువులు చాల తేలికయగును. పండితు లజ్ఞానవంతులయ్యెదరు. పాప భయము పుణ్యాసక్తి దలకిందులగును. ఇట్టి దుష్టకాలమున దుర్మార్గుల దుంచుటకై మంచివారిఁ గాపాడుటకై భగవంతుఁడవతరించవలెనుగదా!

శంబలమను గ్రామమునకు బ్రధాని విష్ణుయశుఁడనువాఁడు. ఈతఁడు విప్రుఁడు. ఈతని యింట "కల్కి" యను పేరట భగవానుఁడవతరించును.

అతఁడా పాదుశోకులఁ జూడఁజూలక క్షత్రియ వేషము గైకొని వేగముగాఁబోవు హయమునెక్కి తిఱుఁగుచు రహాశ్వముతో కోట్లకొలదిగానున్న యీకలిమానవుల నశింపఁజేయును. అట్లు చిరకాలము నీఖలులనెల్లర సంహరించును. తోడనే పరిశుద్ధజీవితులు జ్ఞానవంతులు సాంకర్యరహితులు మిగులుదురు. వారికి భగవానుఁడు దర్శనమిచ్చి ఖలురచే బాధపడినవారి దుఃఖమునపనయించి వారికి సంతాన సమృద్ధినిడును. అంతనారాజు తన కల్కిరూపము నుపసంహరించుకొనగాఁ గలియుగము సంపూర్ణమై కృతయుగము ప్రారంభమగును. నాటిజనులుసాత్త్వికులై విరాజిల్లెదరు.

చంద్రుఁడు, సూర్యుఁడు, గురుఁడు కలసి యేకకాలమున పుష్యమీనక్షత్రములో నుండుకాలమే కృతయుగాదిగాఁ బెద్దలుపల్కుదురు. శ్రీకృష్ణుఁడు భూమినివీడి వైకుంఠమున కేతెంచిననాడే కలియుగాదిగాఁ జెప్పెదరు. మఱియు దేవ మానము చే వేయివత్సరములుదాటిన కలియుగము సంపూర్తియయి కృతయుగమువచ్చునని పెద్దలనుచున్నారు.



# భావతరంగములు

## 8 భక్తి - భాగవతము

నాయనలారా !

నేటిచేయి మానవుల శారణకారణమైన విషయము ను బలువురికోరికలపై నుపన్యసించుచున్నాను. అదేమనగా "భక్తి భాగవతమని" విషయము, భాగవతమునసంస్కృతో వ్యాస భాగవతమును ప్రచారమునకై ధర్మముచేసిన విదుషీమణి గలదు.

ఆమెకు మాటలు రావు. తెలుగుభాష రాదు. ఆమెకు వచ్చినవన్నియు వ్యాసభాగవతశ్లోకములే! ఆయుద్ధవగీతలగోపికా గీతలు ఆరాసక్రీడలు ఆయక్రూరస్తవము అవన్నియు గంథ స్థములు ! అహర్నిశ లాముకళీగాన వినోదునిధ్యానమే: అహ ర్నిశలు ఆబృందావనవిహారి చేష్టావర్ణనలే ! ఆమె భాగవతశ్లోక ములతోగాని మాటాడదు. ఆసతీమతల్లిముందు మనమందరము మనుష్యులమా ! మనము బి. ఏ. లమా ! మనము యమ్. ఏ. లమా ! ఛ ! వెధవబ్రతుకులు ! ఎందుకుపనికిరానివారము;మన మనిపించినది. మొన్న నొకపరి నామెను దర్శించబోయినాను.

ఒకమాటేమిటి ? కోటిమార్లు వెళ్ళినను తృప్తితీరదు. కోటిమారులేమి ! ఆమెకు దనుజుఁడ్నై జన్మించిన నామెతో బాటుగోపికనై బృందావనికిఁబోయి యా! శ్రీకృష్ణపరమాత్మను దర్శించి తరించెడివాడనేమోగదా ! ఆమె భక్తిగూర్చి ప్రస్తా వవశమున నాతోనిట్లుపన్యసించినది.

భక్తియనగా సేవించుట. అవసరమున్నకై భార్యభర్తను గురుని శిష్యుడు ప్రభువును సేవకుడు ధనికులబేదలు ఇష్టులు పురసప్రసక్తుడీన్ని సేవించుచుందురు.

ఈభక్తి సాధ్య సాధన యనుపేరిట రెండురకములుగా నున్నది.

ముక్తిగలుగుటలో గర్మ జ్ఞాన వైరాగ్యములు కారణములుగదా! కొందఱాక్రమము మర్కటలేకుండగా భక్తిచేతనే ముక్తిగలుగునని వాదించుచున్నారు. కొందఱు భక్తితోనే కర్మ నాచరించెదరు. దానిమూలమున భక్తితోనే జ్ఞానము సంపాదించి భగవద్భక్తిచేతనే విరాగులగుదురు. కాన భక్తిలేని యీకర్మ జ్ఞాన వైరాగ్యములు వ్యర్థములని యెందగందురు.

ఇక ఈభక్తిగలుగుటకు బెంపొందుటకు విగ్రహారాధనములు భజనలు జపములు ముఖ్యములు. సిదపంగొంతకాలము నకు క్రమానుభవముచే మానసికారాధన మలవర్చుకొనవలెను

మాతృదేవోభవ- పితృదేవోభవ- ఆచార్యదేవోభవ- ఈమాతృ- పితృ- ఆచార్యసేవలు మున్నగువానికి భక్తియే ప్రధానములుగదా! కాని యీభక్తివలన దరించినవారు ఆంజనేయులు మార్కండేయుడు ధ్రువుడు మున్నగువారు గలరు. పలువురుబొమ్మలనునే జన్మాంతర సంస్కారములుమానసికభక్తి నందుదానిచే జ్ఞానవైరాగ్యములనంది తరించిరి. భక్తిచేతనే భగవంతుని యుద్ధవుడు గోపికలు రాధ అక్రూరుడు మున్నగువారు స్మరించి భజించి తరించిరి. కాళిదాసాదిమహాకవులు కాళికాదులభక్తితోనుతించిరి. జయదేవుడు మున్నగుమహాకవులు శ్రీకృష్ణాదులశృంగారభక్తితో సేవించితరించిరి.

కొందరు పరమభాగవతులు మనకు నిత్యస్మరణీయులై భక్తిచేతఁ గర్మలచేత జ్ఞానవైరాగ్యములనంది తరించినవారు గలరు. వారెవరనగా-

శ్లో = ప్రహ్లాద- నారద- పరాశర- పుండరీక-
వ్యాసాంబరీష- శుక- శౌనక- భీష్మ- దాల్భ్యాన్.
రుక్మాంగదార్జున వసిష్ఠ విభీషణాదీన్
పుణ్యానిమాన్ పరమ భాగవతాన్ మనసాస్మరామి

అని చెప్పఁబడెను.

ఈభక్తిని సంక్షేపముగా మధురభక్తి శృంగారభక్తి యనినారు. ఈమధుర భక్తులు పోతన్నవంటివారు కేవలము భగవంతుని సుందరాకారమును వర్ణించెదరు. శృంగారభక్తి యనగా తనలోని విరహము నాదైవతముపై నారోపించి వారి శృంగారమును వర్ణించుట.

శ్లో= యేయథా మాం ప్రపద్యన్తే
తాంస్తథైవ భజామ్యహమ్-

ఎవరెట్లు నన్ను ఏ రూపములో నేనామములో సేవించెదరో ఆ రూపములో నానామముతో వారినట్లు గాపాడెదను.

ఈభక్తి నిష్కామ సకామ అనుపేరిట రెండురకములు నిష్కామభక్తియనగా నొకకోరిక నెరవేరుటకై యారాధించుట పిల్లలయాయురారోగ్యములకని భార్య చెప్పినట్లు వినుటకని తన కైశ్వర్యముకలుగుటకని మ్రొక్కెదరు. అని సకామభక్తి అప్పడాఫలము చేకూరువరకే భగవంతుఁడు వీరిని గాపాడును. నిష్కామభక్తి ఏ కోరికలు లేకుండగా దైవమును పూజావాహన

జపములచే గొలుచుట ఈభక్తిగలవారిని భగవానుఁడు యావ జ్జీవము కాపాడి రక్షించును,

చూచుచు నాయనలారా!

డబ్బు లేక పన్నులు కట్టలేక పిల్లలకుఁ జదువులు గాక యారోగ్యములేక తీరుబడిలేక దారిద్ర్యములతో సతమతమగు చున్నాము. ఆభగవంతుని గొలుచుటకుగాని సేవించుటకుగాని కనీసము స్మరించుటకుగాని వ్యవధానము చిత్తశాంతి లేదే? ఆతనిని సేవించుట యెట్లు? అనగా నీవా భగవంతుని క్షణకాలము సేవింప స్మరింప భజించుటకే తీరిక లేకయుండగా జగత్కుటుంబియైన యాతఁడు నిన్ను రక్షించుట కవసరమేమి? అనిశ్చల భక్తి నీకుఁ గలిగి నీవాతని సేవించునాడే యాతఁడు నిన్ను గాపాడుచుండును. నీయందు నిక్కముగా నామహనీయునకు దయగలిగి కాపాడినను నెవఁడు కాపాడుమనెను. నన్ను “అని చెప్పనంతటి కృతఘ్నుఁడవు నీవని యాతఁడెఱుఁగును.

బాల్యమునుండి గష్టపడి కనిపెంచిన తలిదండ్రులనే యెవఁడు నన్ను గనుమన్నాఁడు? ఎవఁడు పెంచుమనినాఁడు? నేను “గనిపెంచుము! బాబూ! అని” యేడ్చితినా? అని నీవ డుగుటలేదా? అష్టకష్టములఁబడి యహోరాత్రములందు సకల విద్యలఁజెప్పిన గురుజనులతో “మిమ్ము నెవఁడు చదువు చెప్పుమనెను? విడిచిపెట్టలేక పోతిరా? అని ధీమాగా నడుగునంతటి కృతఘ్నుఁడవు నీవుకావా? కావున నే యితర చింతలుమాని నన్నెవరు “దిక్కులేనివాఁడను. రక్షింపు మహానుభావా! అని యేడ్చెదరో! సకల భారములు సమస్త సుఖములు విడిచి నన్ను శరణుజొచ్చెదరో! అట్టి నిత్యాభియుక్తుల యోగక్షేమము లనే నేనువహించెదనని వారిని గాపాడెదనని యాయనభగవద్గీత

లో నుడువుచున్నాఁడు.

శ్లో॥ అనన్యాశ్చింతయన్తో మాం
యేజనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం
యోగక్షేమం వహామ్యహమ్,

పైగాఁ ఆభక్తుఁ డెట్లుండవలెను? అనఁ నతఁడే నిర్ధారణ చేయుచున్నాఁడు. ఎట్లనగా దీనుబడిలేదని తిఱుఁగలేనని యింటనే కూర్చొని యంగడిలోనిబెల్లము నాలయములో నీశ్వరునకు నివేదనము సేయుచు నన్ను గాపాడలేదని యేడ్చెడివారు గలరు. ఒకనమస్కారముచేసి నాకు లక్షలకొలఁది ధనమీయ లేదేమి? ఆదేవుఁడు ! అని ప్రశ్నించువారు గలరు.

కాన నదికాదు. సర్వకాల సర్వావస్థలయందు నాయందున్న మనస్సుతో నుండుము, నాకే భక్తుఁడవుగుము నాకై హోమము చేయుము, నాకై మ్రొక్కుము. ఈ జగములో నేను దక్కనితరము నీకెన్నడు కనిపించదో ! అప్పుడే నన్ను జేరగలవు. అని గీతలో నుడువుచున్నాఁడు.

శ్లో॥ మన్మనాభవ మద్భక్తో - మద్యాజీ మాం నమస్కురు,
మామైవేష్యసి యుక్త్వైవ - మాత్మానం మత్పరాయణః
అనినిష్కర్షగా మొగమాటములేక
మూఁడు ముక్కలతో నుడువుచున్నాఁడు.

దీనివలన నెవరెట్లు సేవించిన నట్లు రక్షించుట యాయన విధియని తెలియుచున్నది. కావుననే గోపికలకుఁ బ్రియుఁడు

గాను హనుమదాదులకు రాముఁడుగాను ఉద్ధవాదులకు భగవంతుఁడుగాను శిశుపాలాదులకు శత్రువుగాను రుక్మిణ్యాదులకు భర్తగాను భీష్మాదులకు విరాట్పురుషుఁడుగాను వారుగొలుచుచున్న యాకారముల ననుసరించి వారికిఁగన్పడి రక్షించుచు భక్షించదగినవారిని భక్షించుచు నున్నాఁడు. కాన నీవేరకమైన మనఃప్రవృత్తితో ఆతని ఎంతగాఢముగాఁ బ్రేమించి నమ్మి గొలిచెదవో ఆయన నిన్నంతగా ఆరకముగా గాపాడును. నీప్రార్థనల మన్నించును. నీ వాయనను నాస్తికుఁడని ప్రచారముచేసెదవా? నిన్నాతని డాకుంభీపాతనరకములలోనే యీ జననమరణ ప్రవాహములలోనే యుంచును. గాని గాపాడఁడు, జాగరూకతగా నుండి యాయనను సర్వకాల సర్వావస్థలయందు భక్తిప్రపత్తులతో భజియింపుము. ఆయన కాపాడును. శ్రీహరి భక్తుఁడైన ప్రహ్లాదుని గావలేదా? దిక్కులేకయనాధవలెనే సభలో దననే త్రికరణశుద్ధిగా వేడుచు ఏడ్వగా నా ద్రౌపదిని వలువలిచ్చి కాపాడలేదా? సవతి తల్లిమాటల కభిమానపడి వనములకువచ్చి యనన్య శరణ్యుఁడై యారాధించిన ధ్రువుని గాపాడలేదా? నాడు వేయిసంవత్సరములు మకరి బాధపడి దిక్కులేక దుఃఖమున్నై పజాలక,

నీవేతప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపందగున్ దీనునిన్-
రావే! యీశ్వర! కావవే వరద! సంరక్షించుభద్రాత్మకా!
అన్నిత్రికరణశుద్ధిగా వేడుకొనగా గజేంద్రునిగాపాడ లేదా!

ఈకలిలోనే యెందఱో నీసేవించి తరించలేదు త్యాగయ్య-పోతన-గోపన మున్నగు వారెందఱులేరు? వారిని నేను

జూడలేదు. అందువు. నీవుకూడ అనన్యమనస్కుడవై భక్తితో సేవించినచో నాతఁడు నిన్ను గాపాడును. లేనిచో నీపాపఫల మనుభవించుచుందువు.

నాయనలారా! ఇఁక భాగవతమునుగూర్చి ముచ్చటించుకొందుము.

భగవంతుని చరిత్రయే భాగవతము, లేక భక్తులుభాగవతులుగాన భాగవతుల చరిత్రయే భాగవతమైనది. భగవతి భక్తః భాగవతః అనిగదా!

భగవన్మయమైన చిత్తవృత్తిగలవానికే యాతనిని త్రికరణములనమ్మి సేవించువారికే భాగవత మర్థమగును గాని యితరులకర్థముగాదు. పఠనమే మొదలిడినను సాగదు. ఈభక్తియే పరమపురుషుని జేరుటకుఁ దోవ నావయుఁగూడ నైయున్నది. భాగవతపఠనమువలన లాభములేమని ప్రశ్నించుచున్నారా? ఇది భక్తిపూర్వకముగాఁ బఠించువారికి భక్తివృద్ధియై యది జ్ఞానముగామారి వైరాగ్యమును బెంపొందించును. శివకేశవుల యందు భేదబుద్ధి వలయును. ఇదే యద్వైత భావన. ఇదా యీశ్వరుని యనుగ్రహములేనిదే మనప్రయత్న మాత్రము ననే రాదు.

శ్లో॥ ఈశ్వరానుగ్రహాదేవ-పుంసా మద్వైతభావనా.

అనిగదా! ఉత్తమ ధీమంతుల కాలక్షేపలక్షణమునొక కవి యెంతవ్యంగ్యముగా నుడువుచున్నాఁడో! విను.

శ్లో॥ ప్రాత ర్ద్యూతప్రసంగేన
మధ్యాహ్నే స్త్రీ ప్రసంగతః

రాత్రౌ చోరప్రసంగేన
కాలో గచ్ఛతి ధీమతామ్.

మాకవి యేమనుచున్నాఁడో విను.

గీ= ఉదయమున ద్యూతవిషయాల నొప్పుచుండి
ఆడువారలగొడవ మధ్యాహ్నమందు
రేయి దొంగలగొడవతోఁ దొర్లియుచుండి
కాలమును నెట్టుచుందురె! ఘనులు సతము.

అనగా జూదములగొడవ భారతము, ఇదంతయు రాజకీయముగాన దీనినుదయముననే పఠించుచుందురు. ఆడువారల గొడవ, రామాయణము. ఇది సకల కామప్రదము. స్త్రీలను గౌరవించవలెను. గాన దీనిని మధ్యాహ్నమున జదువుమనినారు చోరప్రసంగము. భాగవతము, ఇది మోక్షప్రదము, రాత్రి నిద్రారూపమైన యజ్ఞానము నుందును. అందుండికాపాడుటకై రాత్రి భాగవత పఠనము సలుపమనినారు.

ఇంక భాగవత పఠనముచే భక్తిగలుగును. వైరాగ్యమబ్బును. ఈవిరాగి యెట్లుండును? ఆభక్తి యెట్టిది? అని తెలియఁగోరినచో భగవంతుని లక్షణములు, ఆతనిచరిత్ర, భక్తలక్షణములు మున్నగునవి తెలియవలెను, దీని కద్వైతభావన కావలెను. దీని కాధారము వేదాంతశాస్త్ర ప్రవేశము. ఈవేదాంతము ఆభగవంతుని చరిత్ర భాగవతమున గలదుగాన నిది శాస్త్రమైనది. రెండువిషయముల నొకేగ్రంథముగో నిమిడ్చి వ్యాసుఁడు ధన్యుఁడైనాఁడు. మనలఁదరింపఁజేసినాఁడు.

1 ఈ శరీర సృష్టి నిర్మాణము 2 జీవాత్మ పర

మాత్మల స్వరూపనిర్ణయ పూర్వకముగా సద్వైతస్థాపన, సృష్టిస్థితిలయ లక్షణములు, రాజవంశచరిత్రలు, మృత్యుస్వరూపము భగవత్ప్రాప్తి మార్గములు మున్నగునవి భాగవతముచేఁ దెలియఁదగినవి. సాత్త్వికభక్తులు రాజసభక్తులు తామస భక్తులు వారిస్వరూప స్వభావ కథనము మున్నగునవియు నీ భాగవతముననే గలవు. మానవుల కర్మస్వరూపములువానిఫలములుకూడ బోధించబడెను. నిజముగా సృష్టితత్త్వము పఠనము చేసికొనినవారు భక్తితన్మయులై భగవచ్చిత్తులై యుందురు

నాయనలారా! 18 పురాణముల రచయితయైన వ్యాస మహర్షి చిత్తశుద్ధి లేక యొకయడవిలోఁగూర్చొని విచారించు చుండగా నారదమహర్షి వచ్చెను.

మహాత్మా! ఈ విచారమునకు గారణ మేమని వేదవ్యాసా! నీవు బహుపురాణ కర్తననుకొనుచున్నావు గాని భగవచ్చరిత్ర వర్ణించ నైతివి! అందువే నీకా చిత్తశాంతిలేకుండెనని వాకుచ్చి భాగవతమునురచింపుమని బోధింపుమనెను. ఆభాగవతరచనచేనావ్యాసుఁడు తరించినాఁడు, ఇదిత్రిమతస్థులకు నారాధ్యగ్రంథము గదా! అద్వైత బోధకము గదా!

దీని స్వరూపమెట్టి దనగా—

భాగవత లక్షణము లేవనగా, పదునెనిమిదివేల శ్లోకముల పదిరెండు స్కంధములతో హయగ్రీవ బ్రహ్మవిద్యతో వృత్రాసురవధతోఁ గూడుకొనినదేభాగవతమని యీవ్యాసుని నిర్ణయము, పైగా గాయత్రీ మంత్రముతో నారంభముకావలెనట!

శ్లో॥ = గ్రంథో౽ష్టాదశసాహస్రః
ద్వాదశస్కంధ సమ్మితః
హయగ్రీవ బ్రహ్మవిద్యా
యత్ర వృత్రవధ స్తథా
గాయత్ర్యా సమారంభః
తద్వై భాగవతంవిదుః

అని దానిలక్షణముల నిర్ణయించి యనితరసాధారణతను దీనికిఁ గల్పించినారు,

మఱియు దీనిని ఆసన్న మరణుఁడై సప్తదినస మాత్రాయుష్కుఁడై సరస్వతీనదీతీరస్థ మునిబృందము చెంతకువచ్చి శరణంబేన పరీక్షిన్నరేంద్రునకు శ్రీశుకమహర్షి యాతని సందేహములఁ దీర్చుచు ఆతని దరింపఁజేయుటకై ప్రకాసింపఁ జేసి యుపదేశించినాఁడు. ఏఁడు దినసములలో ముక్తి గలుగు విధానము మార్గము జీవులకుగలదా ? అనుప్రశ్నతో నారంభమై యామహారాజు సందేహములఁదీర్చుచు భక్తి, జ్ఞానవైరాగ్యముల నాతనికిఁ జేకూర్చి యెనిమిదవనాఁడు ముక్తినిచ్చిన దీభాగవతమే !

ముక్తికాంతా స్వయంవర మహోత్సవభరితుని బరీక్షిత్తు నేగాకసకలపాఠకలోకములకు ముక్తినొసగుచున్నదీభాగవతమే!

పండితులపాండితీ పరీక్షలోఁ బరాకాష్ఠనందినదీగ్రంథమే సుమీ !

మిగిలినపురాణ వాఙ్మయ మంతటితోఁ దులదూగుచు రచయితవ్యాసునితోఁ బాటు పఠితలకుఁగూడ ముక్తినిడునదీ గ్రంథమే !

జన్మతః తానుబ్రహ్మజ్ఞాని యైన శ్రీశుకుడై దానిని బోధించుటలో అగ్రతనందినాడు. అట్టిమోజ్ఞులుమనకు దొరుక వలెను గదా !

మానవజను వేల గలుగునో ? ఏమిచేసిన ముక్తి వచ్చునో ! తెలియపరచున దీభాగవతమే !

ముక్తి ధామమును బొందగోరువారికి బాటజూపి ప్రయాణసాధనముల సమకూర్చిపంపున దీభాగవతమే !

మనముక్తికి అంతరింద్రియ-బాహ్యేంద్రియము లెట్లు సహకరించునో ! మన శరీరనిర్మాణములో వేల్పుల తోడ్పాటునెంత గాగలదో ! ఆ విధానమును జూపున దీభాగవతమే !

కర్మ-జ్ఞాన వైరాగ్య స్వరూపముల నుదాహరణప్రత్యుదాహరణములతోఁ దెలుపునదీ భాగవతమే !

భగవంతునిరూపము. నివాసము. కార్యక్రమము. భక్తరక్షణ తత్పరత, ఆరాధనాక్రమము లనుపదేశించునదీ భాగవతమే !

ఇవన్నియుఁజెప్పి యీసృష్టిస్థితిలయములవలన భగవంతునకు గలుగు లాభమేమని ప్రశ్నించి సర్వకామ పరిపూర్ణుఁడైన యాతని కేకోరికలుండును ? ఇదాతని స్వభావమే యనుచున్నాఁడు,

శ్లో॥ దేవస్యైష స్వభావోఽయ
మాప్తకామస్య కా స్పృహా ?

అని చెప్పుచున్నాఁడు.

నాయనలారా! ఏమనుచున్నారు? శ్రీకృష్ణుఁడు గోపికాజారుఁడట! నవనీత చోరుఁడట! నిజమేనా! అనియా! త్రికరణశుద్ధిగా నిజమే! ముక్కాలు మువ్వీసము నిజమే: పదియారు అణాలభాగము నిజమే!

1. రామావతారములో పురుషవిగ్రహములోనున్న స్త్రీ రూపుఁడైన రాముని దివ్యసౌందర్యమునకు ముగ్ధులై యాతని నాలింగనము చేసికొననిమ్మని ప్రార్థించినమునులే యీకృష్ణావతారమున గోపికలుగా జన్మించిరి. శృతులు- స్మృతులు-కూడ గోపికలు గానయిరి. వీరి యద్వైత బ్రహ్మానుసంధానమే యాగోపికల ప్రేమ- ఈభగవద్భక్తుల ప్రేమను బట్టియే గోపికాజారుఁడని యాతనికిఁ బేరిడినాఁడు,

2. మనస్సునకు సహజమైనది జ్ఞానము, తద్భిన్నమైన దజ్ఞానము. ఇది మనస్సునకు నవక్రొత్త చైతనమును. నీత=పొందెంచున దజ్ఞానము. అనగా వారి యజ్ఞానమును చోరుఁడు హరించువాఁడని చెప్పికొనిన సరిపడును.

నాయనలారా! మన పూర్వజన్మ వాసనమంచిది. కాననింతమాత్రమునమైన భగవంతునిగూర్చి భాగవతమునుగూర్చి ముచ్చటించుకొంటిమి.

ఓం తత్సత్.